

శ్రీ మహాంతు ప్రయాగదాస్ జీ వారు.

శ్రీతిరుమలై తిరుపతి మొదలగు దేవస్థానముల విచారణకర్తలు.




శ్రీ వేంకటేశ్వరస్వామివారు.

# DEDICATED

TO

His Divine Majesty

LORD, SRI VENKATESWARA SWAMY

AND

His Holiness

SRI MAHANT PRAYAGA DOSSJEE

By their faithful servant,

the author

# మొదటికూర్పునకు పీఠిక.

శ్రీవేంకటేశ్వరస్వామివారి దేవస్థానములో శ్రీవిచారణా కర్తలవారిక్రింద పారుపత్యదార్ అను నుద్యోగమును వహించు చుండు నేను యాత్రికుల సౌకర్యార్థ మొక గ్రంథ మత్యావశ్యకమని స్వానుభవముచే నిశ్చయించి దీనిని రచియించినాఁడను. ఇందులో కొన్నిసంగతులు అవ్యవస్థచేవదలియుండును. అవి రెండవకూర్పులోఁ జేర్చబడును.

ఈ చిట్టి పొత్తములో శ్రీవేంకటేశ్వరస్వామివారి మహాత్మ్యమును గుఱించి నేనేమియు వర్ణింపలేదు. గాని "కలౌ వేంకటనాయకః" అను వాక్యము సార్థకమని తెల్పుటకు దృష్టాంతరములు పెక్కులుగలవు. అందులో నొకటిఁ జెప్పెదను. ఒక్కదివసమున అనగా శుక్రవారమునఁ గొచ్చిసంస్థానములోనివారు తమ కుటుంబసహితము మధ్యాహ్నము 11ఘంటలకు తిరుమలకు వచ్చిరి. అందులో గృహిణికి కాళ్లు 6 నెలలక్రిందటపక్షిపోయి చాఁచుటకునడచుటకువీలులేక దేఁకుచుండెను. వారలకు స్వప్నావస్థలో "ముడుపులతో నామెను నాకొండకు తీసుకొని వచ్చి స్వల్పకాల మచ్చటనుండినఁ గాళ్లు నిచ్చెదను" అని శ్రీవారి యుత్తరవుకాఁగా వారువినక కాళ్లు బాగుపడినంతట వచ్చెదమని ప్రార్థించిరి. ఆఱునెలలదాఁకఁ బ్రతీక్షించి కాళ్లు రాకపోవుటవలన శ్రీవారి యాజ్ఞప్రకారము వచ్చిరి. ఇచ్చట నొక్కవార ముండమని స్వప్నమయినది. ఆప్రకారమె

వారు ప్రదక్షిణ మొనర్చుచు గుంపులేక చక్కఁగా దర్శనము చేయించగలందులకు నన్ను కోరఁగా నేనందుకు సౌకర్య మొసర్చినాఁడను. ఆమె మఱుశుక్రవారమున గోవిందనామస్మరణఁ జేయుచు ఆవేశముతో నంగప్రదక్షిణముఁ జేయుచుండెను. దైవ మాయఁజెప్పుట కలవికాదు. ఆమె ప్రదక్షిణములోఁ గాళ్లను చాఁచెను. అంగప్రదక్షిణసమాప్తియందు ముడుపుబట్టుకొని యావేశముతోనడిచివచ్చి బంగారు వాకిలిముందు నిలుచుకొనియున్న నన్ను "హుండిఎల్లి" అని కన్నడభాషలో నడుగ నేనుఁ జూపితి. అందులో ముడుపుఁజెల్లించి యాఱుగురితోఁ గూడిన యాకుటుంబమా అభిషేకదర్శనపు టిక్కెట్లుకొని లోపలికివెళ్లిరి. అనంతర మావేశమునిలిచెను. సంతోషముతో వారింటికిఁ జనిరి. దీనినిఁ బ్రత్యక్షముగాఁ జూచినవా రనేకులు గలరు. ఇట్టి మహానుభావుని దర్శనమునకు విచ్చేయువారి సౌకర్యార్థము నేను దీనిని వ్రాసినాఁడను. శబ్దదోషము లెంచక అర్థగుణములను గ్రహింపఁ బ్రార్థించెదను.

తిరుమల.
21—4—19.

ఇట్లు సుజనవిధేయుఁడు,
ఎస్. వి. లక్ష్మీనరసింహారావు.

# రెండవకూర్పునకు పీఠిక.

ఈ పుస్తకము మొదటికూర్పు అయిపోయి రెండవ కూర్పు వేయనవసరము గలిగి నందున యాత్రికుల కుపయోగార్థము తీర్థములు గుఱించి ఒక్క అధ్యాయము చరిత్ర అను నొక అధ్యాయము నిందు చేర్చబడి ఈ దేవస్థాన మిపుడెటుల పాలింపబడుచున్నదో ఆపద్ధతియు నించుక నిక్కడ వివరించెదను.

శ్రీ వేంకటేశ్వర స్వామివారి దేవస్థానము క్రీస్తు శకము 646-వ వత్సరము వరకు హిందూ రాజుల వలనను, క్రీస్తు శకము 1801-వ వత్సరము వరకు మహామ్మదీయ రాజుల వలనను, అనంతరము ఇంగ్లీషు ఈస్టు ఇండియా కంపెనీ వారి వలనను పాలింపబడెను. (Vide Gazetter of South India & Volume 5 of the Imperial Gazetter of India,)

గౌరవ నీయులగు కోర్టు ఆఫ్ డైరక్టర్సు వారును, గవర్నమెంట్ ఆఫ్ ఇండియా వారును 1840-1841 సంవత్సరములలో దేవాలయములు, మసీదులు; మతసంబంధమైజనులు జేరునటు వంటి ఇతర ప్రదేశముల పారిపాలన విషయమై సర్కారు ఉద్యోగస్థులు ఏమాత్రము ప్రవేశించ గూడదనియు అప్పుడు సర్కారు వారి ఆధీనములో నుండు నటువంటి దేవాలయములు మొదలగువాట్లను ఆయామతమునకు చేరిన వారికే స్వాధీనము చేయవల్సినదని ఆజ్ఞాపించిరి. 1841 సంవత్సరములో ఆ ఉత్తరవు ననుసరించి ఆలోచన సభతో కూడిన మదరాసు గవర్నరు గారు రెవిన్యూబోర్డు వారిని తగు చర్యలను తీసుకోమని వ్రాసిరి. సర్కారు వారు పరిపాలించుచుండిన దేవాలయములు మొదలగు అన్నిటికి ట్రస్టీలను ఏర్పరచి వారిస్వాధీనము చేయునపుడు శ్రీవేంకటేశ్వరస్వామివారి దేవస్థానములో మిరాశీ

కైంకర్యపరులయిన పెద్దజియ్యంగార్లును,ఇతర కైంకర్యపరులును కొందఱు జమీందారులును ఈ దేవస్థానం విచారణ కర్తృత్వము తమకు దయచేయవలయునని కోరినను 1843 సంవత్సరము ఏప్రల్ నెల తే 21 దిలో ఆలోచన సభతో కూడిన మదరాసు గవర్నరు వారు అప్పటి శ్రీ హాత్తిరాంజి మఠాధిపతి వారైన శ్రీమహంతు శేవాదాసుజీ వారిని శ్రీవెంకటేశ్వరస్వామి వారు వగైరా దేవస్థానము విచారణకర్తలగా అంగీకరించి వారి తద నంతరం వారి శిష్యులు ఎవరు వారిస్థానమును అలంకరించెదరో వారు దేవస్థానపు కార్యమును జరిపించవలయునని ఏర్పాటు చేసిరి. ఈ ఏర్పాటు ననుసరించి 1843 సంవత్సరం జూలై నెల తే 10దినాడు శ్రీ మహంతు శేవాదాస్ జీవారిపేరట ఒక్క సన్నదుపుట్టి శ్రీ వేంకటేశ్వరస్వామి వగైరా దేవస్థానములును, వార్లకు చేరిన ఆభరణములు వస్త్రములు, వాహనములు, విగ్రహములు మొదలగు సొత్తులను వారిస్వాధీన పరచినందున తదాదిగ నీదేవస్థానములు శ్రీహాత్తిరాంజిమఠము మహంతుల వారి విచారణకర్తృత్వమునకు లోబడి పరిపాలింపబడుచున్నవి.

ఈ దేవస్థానములకు 1907-వ వత్సరములో ప్రీవికౌన్సిల్ తీర్మానము ననుసరించి యొక స్కీము (Schemes) ఏర్పడినది. ఈస్టు ఇండియా కంపెనీ వారు ఈ దేవస్థానములు శ్రీమహంతుల స్వాధీనముచేసినది మొదలు ప్రస్తుతపు శ్రీవిచారణకర్తల వారయిన శ్రీమహంతు ప్రయాగదాస్ జీ వారు ఆరవ విచారణ కర్తగా నున్నారు. స్కీము ఏర్పడిన తర్వాత మొదటివారు. వీరు 1900-వ సంవత్సరమున సీహాదాకు విచ్చేసి మరువర్షంబున మైనారిటి తీరిన తర్వాత స్వయముగా నధికారము జూడప్రారం

భించిరి. దేవస్థానములు శ్రీమహాంతుల స్వాధీనము జేయుసరికి వత్సరంబునకు సుమారు 1½ లక్ష రూపాయలు రాబడి ఉండె ను. 1906-1907 వత్సరములో రు. 4, 43, 153-9-9లు రాబడి వచ్చెను. 1919-1920 వత్సరమున అనగా 1329 ఫసలీలో 14, 97, 267-13-0 రాబడి గల్గెను. ప్రస్తుతపు శ్రీవిచారణకర్త లైన శ్రీమహాంతు ప్రయాగదాస్‌జీ వారి వలన ఖరీదు చేయ బడిన రెండు తాలూకాలు అనగా తిరుతని కచ్చినాడు తాలూ కాలు వలన రాబడె 4 లేక 5 లక్షల రూపాయలు కూడ పై మొత్తములో చేరియున్నది. తిరుతని కచ్చినాడు తాలుకాలు గాక కార్వేటి నగరం సంస్థానములో చేరిన అత్తిమాంజేరి మొ దలు 62 గ్రామాదులు కూడా ఇటీవల ఖరీదుకు తీసియున్నారు.

తిరుపతిలో నొక హైస్కూలు వేలూరులో నొక హైస్కూలు ఉంచబడి పరిపాలింపబడుచున్నవి. తిరుపతిలో నొక సంస్కృతపాఠశాల కలాశాలగాచేయించి అందులో ఒక ఆయుర్వేదశాఖను కూడా ఏర్పరచి విద్యార్థులకు బసభోజనము లిడివిద్యా బుద్ధులు గరపుటకు శ్రీ విచారణకర్తలవారు ఏర్పాటు చేసియున్నారు. ఇంతియగాక అయుర్వేదశాఖకుచేరి ఒక్క ఆయుర్వేద వైద్యశాలయు తిరుమలలో నొక డిస్పెన్సరియు ఏర్పరచి జనులకు ధర్మార్థముగ మందు లిప్పించుచున్నారు. యాత్రికులకు తిరుమల తిరుపతిలో భోజన సదుపాయములు జేసినారు. బసలకు సత్రములునిర్మించుచున్నారు. ఇంకను తిరు మలలో నీటివసతికి, శానిటెషనుకు అనేకపనులు జేయించు చున్నారు. తిరుమలలోను మార్గమునందును వెన్నెల చీకటి అనుభేదము లేక అటవీ మృగబాధతొలగించి రేయింబగలను

భీతిలేక జనులు సంచరించునటుల వాషింగ్టన్ లైట్లు మొదలగు దీపము ఏర్పాటుచేసినారు. తిరుమలలో యాత్రికుల చంటి పిల్లలకు ధర్మార్థముగ ఆవుపాలిచ్చుటకు ఏర్పాటుచేసినారు.

శ్రీ విచారణకర్తల వారివద్ద మంత్రిగ దివాన్ పేష్కార్ అనుహోదాలో నొక ప్రధానోద్యోగి గలరు. వారు దేవస్థానములు, తాలూకాలు మొదలగు అన్నిటిని పాలించుదురు. వీరు శ్రీ విచారణకర్తలవారి ఖచేరిలో నుండెదరు. వీరి చేతిక్రింద తిరుమలమీదపారుపత్యదార్ ప్రధానోద్యోగస్థుడు. (Chief ministeriel officer on Hills)

తిరుపతిలో దేవస్థానపు ట్రజరర్ (ఖజాన్జి) అనునుద్యోగి గలరు. వీరుస్కీము ప్రకారము జిల్లాజడ్జిగారివలన నియమింపబడి దేవస్థానములోనుండి జీతము పుచ్చుకొనెదరు. దేవస్థానపు సొమ్ము వీరిస్వాధీనములో నుండును. వీరు శ్రీ విచారణకర్తల వారి వలన అంగీకరింపబడిన (ప్యాసుచేయబడిన) బిల్లుల ప్రకారము సొమ్ముబట్వాడా చేయించుచున్నారు.

వత్సరమునకు కొక సారి. లెఖలను తనిఖీచేయుటకు చిత్తూరు జిల్లా జడ్జికోర్టు వారు ఒక్క ఆడిటర్‌ను నియమించెదరు. ఆడిటర్ల రిపోర్టులు సరిగా లేనంతట అట్టిలోపములను శ్రీవిచారణకర్తలవారు చూపించుట గలదు.

గ్రంథబాహుళ్యము గాకుండ నిందు దేవస్థానముల పరిపాలన పద్ధతి సంక్షేపముగా వివరించి నందుకు చదువరులు మన్నించెదరు గాక.

తిరుమల
5-9-23

ఎన్. వి. లక్ష్మీనరసింహారావు.

# విషయసూచిక.


| | పుట. |
|---|---|
| మొదటికూర్పు సమవీక్షక. | iii |
| రెండవకూర్పు సమవీక్షక. | v |

I. అధ్యాయము.

| | |
|---|---|
| తిరుపతి ... | 1 |
| యాత్రికుల నాదరించువారు. ... | 2 |
| సత్రములు. ... | 2 |
| శ్రీ కపిలతీర్థము ... | 4 |
| డోలి, మూటలవాండ్రు. ... | 6 |
| కొండమార్గము. ... | 7 |
| అలిపిరి, ఠాణాలు. ... | 8 |
| చలివెంద్రలు భావులు ... | 9 |
| శ్రీలక్ష్మీనరశింహ స్వామివారిగుడి. ... | 10 |
| శ్రీభాష్యకార్ల వారి గుడి. ... | 10 |
| అలపిరి గోపురం. ... | 10 |
| గాలిగోపురం. ... | 11 |
| సారెపెట్టెలు. ... | 11 |
| పంచములు మొదలగువారు. ... | 12 |

## II. అధ్యాయము.


| | | |
|---|---|---|
| తిరుమల. | ... | 12 |
| వృషభాచలము. | ... | 13 |
| అంజనాచలము. | ... | 14 |
| శేషాచలము. | ... | 15 |
| వెంకటాచలము. | ... | 16 |
| శ్రీవెంకటేశ్వరస్వామివారిదేవస్థానం. | ... | 21 |
| వెయ్యికాళ్లమంటపం. | ... | 22 |
| శ్రీహాత్తిరాంజిమఠం. | ... | 23 |
| శ్రీచిన్నజియ్యంగార్లవారిమఠం. | ... | 27 |
| అధికారివారితోట. | ... | 28 |
| మైసూరుగవర్నమెంటువారిసత్రము. | ... | 28 |
| దేవస్థానపుసత్రము. | ... | 29 |
| శృంగగిరిస్వాములవారిమఠము. | ... | 29 |
| గోసాయిమంటపము. | ... | 30 |
| హిందూస్థానీరామానుజకూటము. | ... | 30 |
| వ్యాసరాయస్వాములవారిమఠము. | ... | 30 |
| అర్చకులయిండ్లు. | ... | 30 |
| రాతితేరు. | ... | 30 |
| శ్రీవుత్తరాదిస్వాములవారిమఠము. | ... | 30 |
| శ్రీపరకాళస్వాములవారిమఠము. | ... | 31 |
| రథము. | .. | 31 |
| దివాణము. | ... | 31 |
| వాహన మంటపము. | ... | 31 |

బజారు. ... 32
తీర్థగట్టుసందు. ... 32
శ్రీవరాహస్వామివారి దేవస్థానము. ... 32
ఘంటామంటపము. ... 33
పోలీసుస్టేషన్. ... 33
శ్రీపెద్దజియ్యంగార్ల వారిమఠము. ... 33
ఆచార్యపురుషులు. ... 34
మంగలకట్ట. ... 36
డిస్పెన్సరి. ... 36
భోజనము. ... 36
హోటల్. ... 36

---

## III. అధ్యాయము.

శ్రీవారిదర్శనము. ... 37
శుద్ధి ... 41
తోమాల శేవ. ... 41
కొలువు. ... 42
అర్చన. ... 43
ధర్మదర్శనము. ... 45
అర్చన. ... 46
రాత్రిదర్శనము. ... 46
ఏకాంత సేవ. ... 47

గురువారము. ... 49
శుక్రవారము. ... 50

## IV. అధ్యాయము.

ప్రసాదము. ... 53
పరఖామణి. ... 54
పక్షుదిట్టం. ... 56
శ్రవణనక్షత్రదిట్టము. ... 56
రోహిణి ... 56
ఆర్ద్ర. ... 57
పునర్వసునక్షత్రం. ... 57
చిత్తానక్షత్రం. ... 58
ద్వాదశిపుత్సవము. ... 58
వసంతోత్సవము. ... 58

## V. అధ్యాయము.

సంవత్సరాది ఆస్థానము. ... 59
నిత్యోత్సవం ... 60
ఆనివర ఆస్థానము. ... 61
దీపావళి ఆస్థానము. 61
శ్రీవారి తెప్పోత్సవము. ... 61

శ్రీవారిబ్రహ్మోత్సవము ... 64
నవరాత్రివుత్సవము. ... 65
ధనుర్మాసము. ... 66
అధ్యయనోత్సవము. ... 67
రథసప్తమి. ... 68


---

## VI. అధ్యాయము.


ఆర్జితము:—వుత్సవములు.
బ్రహ్మోత్సవము. ... 96
వసంతోత్సవము. ... 60
కల్యాణోత్సవము. ... 71
ఇతరవాహనములు. ... 71
(b) శేవలు. ... 72
అమంత్రణోత్సవము 73
పూలంగి శేవ. ... 73
పులికాపు సేవ. ... 74
పూరాతిరుప్పావడ. ... 74
అరతిరుప్పావడ. ... 75
కోవిలాళ్వారుతిరుమంజనం. ... 75
సహస్రకలశాభిషేకము. ... 75

## VII. అధ్యాయము.

| | | |
|---|---|---|
| ఆశ్రితనివేదన. | ... | 75 |
| (a) చెరువులు, (b) పల్లు | ... | 76 |
| నిత్యహారతి. | ... | 78 |
| నిత్యఅర్చన. | ... | 78 |
| శ్రీపాదచందనము. | ... | 79 |
| శ్రీపాదరేణువు. | ... | 79 |
| షరాబు. | ... | 80 |
| ముడుపు. | ... | 80 |
| చంద్రగిరిరస్తా. | ... | 80 |
| తిరుమలఅంగడివాండ్రు. | ... | 81 |
| కోతులు. | ... | 81 |
| శాసనములు. | ... | 81 |
| భావులు తులసిపుష్పం. | ... | 81 |
| ఉగ్రాణము. | ... | 82 |
| జ్వరగాలి. | ... | 82 |
| కీటినసతి. | ... | 82 |
| బంగళా. | ... | 83 |
| తరిగొండవెంగమ్మ. | ... | 83 |
| శానిటేసన్. | ... | 83 |
| శ్రీగోవిందరాజస్వామివారిదేవస్థానం. | ... | 83 |
| శ్రీరామస్వామివారిదేవస్థానం. | ... | 84 |
| శ్రీపద్మావతిఅమ్మవారిదేవస్థానం. | ... | 84 |

తిరుమలఅడవి. ... 84
వాహనములు. ... 85
శివలింగం ... 85
దేవతలు. ... 85
ముద్రమండపము. ... 86

## VIII. అధ్యాయము.

### తీర్థములు.

శ్రీస్వామిపుష్కరణి. ... 86
శ్రీవైకుంఠతీర్థము. ... 88
పాండవతీర్థము. ... 90
జాబాలితీర్థము. ... 91
వరాహతీర్థము. ... 93
కుమారధారతీర్థము. ... 95
చక్రతీర్థము. ... 97
ఆకాశగంగ. ... 93
పాపవినాశనము. ... 101
ఘోణతీర్థము. ... 102
రామకృష్ణతీర్థము. ... 104

## XI. అధ్యాయము.

చరిత్ర ... 107



1. దేవస్థానముల విచారణకర్తలవారి ఖచేరి, తిరుపతి.



# తిరుమల తిరుపతి యాత్ర.



## అధ్యాయము. 1.

తిరుపతి:—

శ్రీపురమని సంస్కృతనామముచే వ్యవహరింపఁబడు తిరుపతి యనెడి పట్టణము చెన్నపురి రాజధానిలోఁ జిత్తూరు జిల్లాలోని మ్యునిసిపల్ పట్టణము. తిరుపతికొండలకును కార్వేటి నగరము జమీందారిలో కొండలను వేఱుపఱచుచు నుధ్యనుండు విశాలమైన కనుమలో నీపురమున్నది. తిరుమలకుఁబోవు యాత్రికులు సదా ఉండుటచే నీపట్టణము జనముచే నిండియుండును. ఇప్పురము 1886వ సత్సరమున మ్యునిసిపల్ Municipal పట్టణముగా నియమింపఁబడెను. ఇక్కడ కొన్ని దేవస్థానములు గలవు. ఇవియు శ్రీవేంకటేశ్వరస్వామి దేవస్థానము వలెనె శ్రీ మహంతువారి విచారణకర్తృత్వములో నున్నవి. శ్రీవిచారణ కర్తలవారిఖచేరియు, దేవస్థానము వల్ల నిర్మింపఁబడిన ఆయుర్వేద వైద్యశాలయు, పాఠశాలయు, సంస్కృత కాలేజియుఁ గలవు. ఇంకను మ్యునిసిపల్ హాసుపత్రియు, సబుమేజస్ట్రేటు ఖచేరి, జిల్లా మున్సిఫ్‌కోర్టు, సబ్ రిజిస్ట్రార్ ఖచేరి, పోలీస్ సర్కిల్ ఖచేరీలు గలవు. బాటసారులకు తాలూకా బోర్డువారి బంగళా (Travellers, bangalow) గలదు. అమెరికమిషన్ హైస్కూలు

కట్టడములు గలవు. ఊరుబయట రీడింగ్‌రూముగలదు. యాత్రికులకు సౌకర్యార్థముగ ననేకసత్రములుగలవు. ఇక్కడ తిరుపతి తూర్పు అనియు, తిరుపతిపడమర అనియు రెండు రయిల్వే స్టేషన్లు గలవు. తిరుపతి తూర్పుయాత్రికులు దిగుటకు సుఖము. ఈస్టేషణ పురమును చేరియున్నది.

2. యాత్రికుల నాదరించువారు:—

శ్రీ వేంకటేశ్వరస్వామివారి దర్శనము కొఱకు వచ్చుయాత్రికులు సామాన్యముగా, రేనిగుంట పాకాల కాట్పాడి రయిల్వే జంక్షనాల ద్వారా తిరుపతికి రావల్సినందున వీరిలోననేకు లాజంక్షనాలకు పోయి యాత్రికులు రయిలు బండిలో నుండగనే యనేకవిధములు హెచ్చరించి తమ బసలకు రమ్మనివేడెదరు. వీరల మాటలన్నియు స్వబుద్ధితో యాత్రికులు యోచించి విశ్వసించవలెను. వీరలయిండ్లకు వెళ్లిన బసపాత్ర సామాను లిప్పించెదరు. బియ్యము మొదలగు సామానుల నంగడి (లేక దుకాణా) లోగొనునప్పు డంగడివా రింకొకరికి నీసామానులకు గాను రుసుమియ్యకుండగ జూచుకొనవలెను. ముడుపు లింకను తక్కిన సొమ్ములు యాత్రికులు భద్రముగా గాపాడుకొనవలెను నమ్మి యితరులకియ్యగూడదు.

3. సత్రములు:—

“పుష్పతోట” అనువిశాలమైన దేవస్థానపు సత్రముగలదు. మిగుల శుభ్రముగను, బందోబస్తుగనుండును. ఇచ్చటగుమాస్తా జవానులు (అనగా భంట్రోతులు)గలరు. బసపాత్ర సామానులు

నాల్గు జాతులవారికియ్యఁబడును. రయిల్వేస్టేషన్ వద్ద నుండి 2 లేక 3 అణాలకు బండిబాడుగ (అనగాఅద్దె) కు దొరకును. ఇది బజారుకుఁ జేరికొండకుఁ బోవుమార్గములో నున్నది.

మైసూరు గవర్నమెంటువారి సత్రము. క్రొత్తపల్లి రామాచార్లుగారి సత్రము రయిల్వేస్టేషనుకు ¼ ఫర్లాంగుల దూరమున నున్నవి. బండిబాడుగ స్టేషను నుండి రు|| 0-1-6 కూరగాయలు మార్కెటుకు దగ్గఱగాను బజారుకు దూరముగాను శుభ్రముగను బందోబస్తుగనుండును. బ్రాహ్మణులకుమాత్రము బసలిచ్చెదరు. రామాచార్లుగారి సత్రములో పాత్రసామానులిచ్చెదరు. రెండుసత్రముల యొద్దను గుమాస్తాలుండెదరు. డాక్టర్ రామస్వామినాయుడుగారి సత్రము రయిల్వే స్టేషనుకు చేరియున్నది. నాల్గుజాతులవారికి బసలిచ్చెదరు. సత్రావారిసత్రము పురమునకు పశ్చిమ భాగములో గలదు. నాల్గుజాతులవారు దిగవచ్చును.

శ్రీహత్తిరాంజి మఠమువారి ధర్మశాలపురమునకు మధ్య నున్నది. మార్కెటుకు బజారుకు సమీపముననున్నది. నాల్గు జాతులవారు దిగవచ్చును.

వైశ్యుల సత్రములు క్రొత్తవీధిలో రెండుగలవు.

సౌరాష్ట్రుల సత్రమొకటి శ్రీరాములవారి సన్నిధి వీధిలో గలదు.

N B: యాత్రికులు కూడ ఒక్క మంచి బీగము లేక కప్పతాళము దెచ్చుకొనవలెను. డోలీలు సాధారణముగా ప్రతి సత్రమువద్ద దొరకును గాని పుష్పతోటవద్ద విశేషము.

## 4. శ్రీకపిలతీర్థము.

ఈతీర్థము మిగుల ప్రాచీనము. ఇచ్చట భూలోకములోఁ బార్వతీ పరమేశ్వరులు కపిల మహాఋషికి ప్రత్యక్షమయిరి. ఈలింగము పాతాళములో సురలుచేతను, కపిలమహాముని చేతను బూజింపఁబడి జనుల నుద్ధరింప భూలోకమున కేతెంచెను. శ్రీవేంకటేశ్వర స్వామివారు వకుళమాలికదేవిని శ్రీ పద్మావతిదేవి వివాహరాయబారమునకు మొదటఁ బంపునప్పుడు ఈతీర్థములో స్నానముచేసి శ్రీకపిలేశ్వరస్వామివారి దర్శనము చేసికొని తమవివాహమును గురించి ప్రార్థించ వలెనని చెప్పిరి.

శ్లో॥ అస్మాదేవవరాన్మార్గాదపరుహ్యాగిరేస్తటాత్।
త్వంగచ్ఛాధః ప్రదేశేచ కాపిలం లిఙ్గముత్తమమ్॥
శ్లో॥ తత్రాస్తే తీర్థరాజాఖ్యః కపిలేశ్వరసన్నిధౌ।
తత్రస్నాత్వాయథాయోగ్యంమదర్థం తీర్థపుంగవే॥
శ్లో॥ కపిలేశ్వర మాసాద్యయాచ్ఛతాం పరమవ్యయమ్।
శ్రీనివాసేన బాలేనసదాకల్యాణ కాంక్షిణా॥
శ్లో॥ ప్రేషితాహంతదర్థం వై కురుమేఽభీప్సితంప్రియమ్॥
ఏవముక్త్వాశివం దేవి ! తతఃపద్మతటంగతా॥

భవిష్యోత్తర పురాణము.

ఈతీర్థము తిరుపతికి ఒక్కటిన్నర మైలు దూరముననున్నది. శ్రీవేంకటేశ్వరస్వామివారి దర్శనమునకు గాను కొండనెక్కక మునుపే ఈతీర్థమునకు తిరుపతినుండి యాత్రికులు వెళ్లి స్నానము చేసికొనెదరు. కొండకు హిరణ్యము లేక తీర్థవిధి లేకతీర్థ



4. శ్రీకపిలతీర్థం.

శ్రాద్ధ మిచ్చుట జరిపించెదరు. ఈతీర్థములో స్నానము చేయు నప్పుడు సంకల్పాదులు, దానధర్మములు, తీర్థ శ్రాద్ధములు మొదలగువానిని జేయవలయునని నిర్బంధములేదు. ఇష్టమున్న వారు తమశక్త్యనుసారముచేయవచ్చును. ఒనర్చిన తీర్థవిధుల సాఫల్యమునకై ఇంతకు తక్కువగాక బ్రాహ్మణులకు భోజనమిడవలయు ననియు ఆయాదానములు విధ్యుక్తముగాఁ జేయవలయుననియు నటుల నాయావిధులఁ జేయనియెడలఁ బెద్దలు మోక్షముఁ బొందరనియుఁ జెప్పుమాటలు విశ్వాసార్హములుగావు. యాత్రికుల నిర్బంధించుట కధికార మెవరికినిలేదు. శ్రీవేంకటేశ్వర స్వామివారి ముడుపులలోని ద్రవ్యముచే నీ తీర్థమువద్ద వ్యయముచేయవచ్చునను పల్కులాలింపఁ గూడదు. ఈతీర్థము నొద్ద పితృలకు పిండప్రదానము చేసినంతట తరించెదరు. మృత్పిండ ప్రదానము చేసినను పితృదేవతలు తరించిరి.

శ్లో॥ ప్రాపనర్ప గిరింరాజన్ దైవయోగేనకర్మణా।
తేరాజాన స్తత్రగత్వాతీర్థే కపిలసంజ్ఞకే॥
శ్లో॥ స్నాత్వాభక్తి సమోపేతావపనంచక్రురాదరాత్।
మాధవస్స్వయ మప్యేత్యవాపయామాసవై శిరః॥
శ్లో॥ పార్వణాని ప్రకుర్వంత స్తత్రరాజన్ క్షితీశ్వరాః।
పిండానిచ సుసంహృష్టా శ్శ్రాద్ధీయాని దదు స్తదా॥
శ్లో॥ మాధవోపి శుభేతీర్థే స్నాత్వాత ద్రుచ్ఛపార్వణమ్।
కుర్వన్పిండా న్సమ్రదాకృత్వాపితృభ్యశ్శ్రద్ధయాదదౌ॥
శ్లో॥ దైవాత్తత్కర్మణైవాసౌ తదాభూద్గత కల్మషః।
తస్మాద్యోమానవోభక్త్యా కుర్యాత్తీర్థావగాహనమ్

శ్లో॥ పితృశ్రాద్ధం పిండదానం ముక్తిస్తస్యానసంశయః।
మృత్పిండ కృతవాన్విప్రఃపుణ్యాక్షేత్రే పురాతనే॥

శ్లో. కింవర్ణయామఃపురుషోత్తమ, స్య
క్షేత్రస్యతీర్థస్యచపుణ్యాశక్తిమ్,
మృత్పిండదానా త్పితరశ్చ తస్య
ముక్తిం ప్రపన్నామురవైరిశాసనాత్.

భవిష్యోత్తర పురాణము.

ఈతీర్థ సమీపమున నమ్మాళ్వార్ దేవస్థానము గలదు. ఇది శ్రీ కపిలేశ్వర స్వామి వారి దేవస్థానమువలె వేంకటేశ్వర స్వామి వారి దేవస్థానమునకు సంబంధించినది గాదు. ఈ తీర్థము వైష్ణవు లాళ్వారు తీర్థమందురు.

౯. డోలి. మూటల వాండ్రు.

శ్రీవేంకటేశ్వరస్వామి వారి దర్శనమునకు గొండ నెక్క లేని వారు డోలిలో నెళ్లెదరు. డోలి అనగా చిన్న ఉయ్యాలతొట్టి వలె నొకచిన్న మంచమెు (ఒక అడుగు వెడల్పు రెండు అడుగులు పొడుగు) క బొంగునకు వ్రేలాడకట్టి యిద్దఱచే మోయఁబడునది. బుర్కా డోలి, మేనాస వారి దొరకును. డోలికి సాదారణముగా రు 2-0-0- పుచ్చుకొని తిరుపతినుండి శ్రీ వేంకటేశ్వర స్వామి వారి దేవస్థానమునకు ఒక్క పర్లాంగు దూరమున నూరుబయట (కొండమీద) వరకు మోసెదరు. యాత్రికులు డోలీలను కుదుర్చుకొను నప్పుడు బాడుగ హెచ్చు గాకుండఁ జూడవలెను. ఇందులో కమీషన్ ఏజంట్లు గలరు. ఎవరి అవసరము లేకుండ కొండ మొదటికిఁ బోయి డోలీలను

గుదుర్చుకొన వలెనని పోవుచు మార్గములో డోలీలను హెచ్చరించి డోలి కుదుర్చుకొన వచ్చును. ఒకప్పుడు హెచ్చరించిన బేరము కుదరక పోయినను వాడు వెంటాడించు నంతట వేరే డోలివాడు సులభముగా రాఁడు. డోలి కుదిరిన తర్వాత కూర్చుండఁ బెట్టుకొని కొంత దూరము తీసికొని వెళ్లి ఇదుగో కొండయనియు నొకప్పుడింతవరకె డోలిలో తీసికొని వచ్చుట కేర్పర్చు కొనెననియు, సొమ్ము తెమ్మనియు కొండకు వెళ్లి వచ్చి నంతట నింకను సొమ్మియ్యవలెననియు డోలి వాండ్రు కొందఱు చెప్పుట తఱుచు. ఇట్టి చిక్కులు పడకుండగ నేర్పరచు కొనవలెను. లేదా యాత్రికులు దిగిన సత్రము గుమాస్తాల ద్వారా లేదా యాత్రికుల నాదరించు వారి ద్వారా యేర్పాటు చేసికొన వలెను. ఉదయము డోలీలు దొరకును. మధ్యాహ్నము కొండకుఁ బోవుటకు తిరుపతిలో డోలి దొరకుట దుస్తరము.

సామానులు మోయుటకు బిడ్డల నెత్తుకొని వెళ్లుటకు కూలీలు దొరకుదురు. వీర్లను మూటలవాండ్రందురు. మనిషి 1-కి రు 0-8-0 చొప్పున కూలి తీసికొనెదరు. వీర్లను యాత్రికులు కూడ తీసికొని వెళ్లవలెను. బిడ్డలను విలువగల సామానులను వీండ్రవద్ద నిచ్చి కూడా రమ్మనవలెను గాని దూరముగా నుంచుట నంత క్షేమకరము గాదు.

### 6. కొండమార్గము.

తిరుపతినుండి కొండకు పోవు మార్గమున కలిపిరి రస్తాయనియు తిరుపతిరస్తాయనియు వాడెదరు. ఇది సుమారు ఏడు మైళ్లదూరము గలదు. మొదటి కొండ నెక్కుట నిండాకష్టము. తర్వాత ఒక మైలు కొంచెము కష్టముగానుండు నటుపైన రెండు

మైళ్లు ఎక్కుడు లేక నుండును. అనంతరము మోకాళ్లెక్కుడు దిగుడుగలి తర్వాత శ్రీ వేంకటేశ్వరస్వామి వారు దయచేసి యున్న గ్రామము వరకు మార్గము తేలికగా నుండును. మోకాళ్లెక్కుడు దిగుడు అనున దొక పర్వతము దిగి యింకొక పర్వత మెక్కుట. అనగా నొక కనుమ దాటుట.

అలిపిరి అనగా కొండ పాదము. ఇచ్చట పాదరక్షలు గల మంటపము గలదు. ఈ పాదరక్షలు శ్రీ వేంకటేశ్వర స్వామి వారి వనియు నిక్కడ మ్రొక్కి కానుక లొసగ వలెననియు యాత్రికులకుఁ జెప్పెదరు. ఇచ్చట శ్రీ వేంకటేశ్వరస్వామి వారి ముడుపులు చెల్లింపఁ గూడదు. అట్లు చెల్లించిన యెడల శ్రీ స్వామి వారికిఁ జేరవు.

కొండ మార్గమున బిచ్చగాండ్రనేకులు గలరు గాని వాండ్ర వలన బిచ్చ మడుగుబాధ తప్ప నెట్టి బాధయుండదు. వీర్లలోఁ గొందఱు సాముద్రికము చెప్పునట్లును, మరికొందఱు కాళ్లుం డియు లేనట్టుగుడ్డలు చుట్టుకొని నటించుచు నుందురు. ఇదంతయు దరిద్ర దోషముచే బిచ్చముకొఱకు వేషములు.

ఠాణాలు.

శ్రీ లక్ష్మీ నృశింహ స్వామి వారి దేవస్థానం మొదలు భాష్య కార్ల గుడి వరకు ఎక్కుడు దిగుడు గలదు. ఇదియాత్రి కులకు కష్టముగా నుండును. అనగా ఒక్క పర్వతముదిగి ఇంకొంక పర్వత మెక్కవలెను. ఈ రెండు పర్వతములకు మధ్యను కనుమకు అవాచారికోన యనిపేరు. ఇచ్చట యాత్రి కుల క్షేమమునకు దేవస్థానమువా రొక ఠాణా ఉంచి భటులను పెట్టియున్నారు. దీని కోన ఠాణా అనెదరు. ఇది తిరుపతికి 5



౧. శ్రీవారి అలిపిరిమంటపము అనే పాదరక్షలుమంటపము.

మైళ్ల దూరమున నున్నది. ఇదే మాదిరిగ తిరుపతికి ౩ మైళ్ల దూరమున మామండూరు మిట్ట ఠాణా అనియు నాల్గు మైళ్ల దూరమున ముగ్గుభావి ఠాణాయు గలవు. మూడు ఠాణాల వద్దను భావులు గలవు. ఠాణాలలోని భటులు యాత్రికులకు మిగుల సహాయముగ నుండెదరు.

ఇదిగాక అలి పిరి మొదలు మామండూరు మిట్టవరకు కావలిగా నిద్దఱు దేవస్థానపు భటులు తిరుపతిసబ్ మేజస్ట్రేట్ స్వాధీనములో నుందురు.

7. చలివేంద్రలు-భావులు.

ఈ మార్గమున చలివేంద్రలు రెండు. ముగ్గుబావి ఠాణా యొద్దను మామండూరు మిట్ట ఠాణా సమీపముసను దేవస్థానపు చలివేంద్రలు గలవు. నాల్గవజాతి వారు మంచి తీర్థము దాహ మిచ్చెదరు. తిరుపతినుండి పోవునప్పుడు కోన ఎక్కుడు దాటిన తర్వాత రెండు ఫర్లాంగుల దూరమున నొక దేవస్థానపు చలి వేంద్రగలదు. ఇచ్చట మజ్జిగ మంచి తీర్థము బ్రాహ్మ ణు డొకడు శూద్రు డొకడుండి దాహమిచ్చెదరు. ఈ మూడు చలివేంద్రల వద్ద దాహమునకుగా నేమియు నియ్యనక్కఱలేదు.

శ్లో॥ వేంకటాఖ్యే మహాపుణ్యే తృషార్తానాం విశేషతః।
జలదాన మకుర్వాణః తిర్యగ్యోని మవాప్నుయాత్.

స్కాందపురాణం.

మామండూరు మిట్ట, ముగ్గుభావి, కోనఠాణాల వద్ద భావులు గలవు. యాత్రికులిందలి నీరుపయోగించు కొనవచ్చును.

8. శ్రీ లక్ష్మీనృసింహ స్వామి వారిగుడి.

ఇది అలిపిరిరస్తాలో తిరుపతికి నాల్గు మైళ్ల దూరమున ముగ్గు భావి సమీపమున నున్నది. ఇది శ్రీ వేంకటేశ్వర స్వామి వారి దేవస్థానమునకుఁ జేరినదిగాదు. ఇది శ్రీ వేంకటేశ్వర స్వామి వారి దేవస్థానము యొక్క అర్చకునికిఁ జేరినది. శ్రీ ముడుపు లిచ్చుటనియ్యఁ గూడదు.

9. శ్రీభాష్యకార్ల వారి గుడి.

శ్రీ వారికొండంతయు శేషాంశమనియు నందువలన వైష్ణవ మతోద్ధారకుడైన శ్రీరామానుజుల వారు పాదములతో త్రొక్కఁ గూడదని మోకాళ్లతో నడచి వెళ్లుచు మార్గములో నలసి కొంచెము సేదదీరిన ప్రదేశమున శ్రీభాష్యకార్లవారి గుడి కట్టఁబడినది. ఇది శ్రీవేంకటేశ్వరస్వామి వారి దేవస్థానమునకుఁ జేరినది. ప్రతిదిన మచ్చట నుండి నివేదన వచ్చును. ఇచ్చట శ్రీవారి ముడుపు లియ్యఁ గూడదు. ఇచ్చట శ్రీభాష్యకార్లు వారికి కానుకలు మొదలగున వియ్యవలెనంటె శ్రీవేంకటేశ్వర స్వామి వారి దేవస్థానములో పారుపత్యదారు ఖచేరిలో చెల్లించవలెను గాని నిచ్చట నియ్యఁ గూడదు.

అలిపిరి గోపురము.

అలిపిరివద్ద నిండా పురాతనమైన గోపురముగలదు. ఇది శిథిలమైనందున నెవరు దగ్గఱకుఁబోవకుండ చుట్టు దూరముగ కటాంజనము వేయఁబడినది. ఈ గోపురమందలి ప్రాచీన శిల్పమునకు గాను భద్రముగా కాపాడఁబడుచున్నది.

గాలిగోపురము.

ఇది అలిపిరి రస్తాలో అలిపిరివద్దనుండి ఒక్కమైలుదూరమున నున్నది. అలిపిరినుండి గాలిగోపురమువరకు మార్గము నిండా ఎక్కుడు. యాత్రికులకు కష్టముగానుండును. ఈ గోపురము చాలాదూరమునకు కనబడును. రాత్రులందు గాలిగోపురము వరకు మార్గమునను, గోపురముపై భాగములోను దేవస్థానము వారు దీపములు వేయించెదరుగాన నాదీపము చాలాదూరము కనబడును.

ఈ గోపురమునుచేరి ఒక్కమఠముగలదు. దీనిని గాలిగోపురము మఠమనియు, వైకుంఠదర్వాజామఠమనియు వాడెదరు. ఇచ్చట కొందఱు ఉత్తర హిందూస్తాను సాధువులుగలరు. సదా వృత్తిచ్చెదరు. ఈ మఠము తిరుపతిలోనుగలదు. తిరుమలలో నొక కట్టడముగలదు.

సారెపెట్టెలు.

భాష్యకార్లవారి దేవస్థానము దాటినతర్వాత కొన్ని గజములదూరములో పెట్టెలుపేర్చినటుల శిలలుగలవు. ఆ పెట్టెలకు నాలుగుప్రక్కల ఆంజనేయవిగ్రహములుగలవు. శ్రీపద్మావతిన్మ వారు సారెతెచ్చుకొనుచు అక్కడకురాగా నామెకు కోపము వచ్చినందున నాపెట్టె లచ్చటనుంచి ఆంజనేయులను కావలిపెట్టి పద్మ సరోవరమునకు వెళ్లినట్లుచెప్పెదరు. కోపమునకు కారణము పలువిధములుజెప్పెదరు. అయితే శ్రీవారికి కావల్సిన వస్తువులు కొన్ని తేలేదని శ్రీవారు నిరాదరణ చేసినందువలన కోపముగల్గెనని చెప్పెదరు. ఇచ్చట శ్రీ అమ్మవారి అడుగు జాడలు కనబడును. ఆ జాడలను మార్గస్థులు పూజించెదరు.

పంచములు మొదలగువారు.

నాలుగుజాతుల హిందువులుతప్ప నితరులు కొండనెక్కఁ గూడదు. అలిపిరివద్ద శిలామనుజుడు సాష్టాంగముగఁ బడియున్నాఁడు. అదిదాటి రాఁగూడదు. 1871-వ సంవత్సరములోని గవర్నమెంటువారి ఉత్తరువు ప్రకారము మెజస్ట్రీరియల్, పోలీసు యూరోపియన్ ఉద్యోగస్థులప్పుడప్పుడు పోయెదరు. పంచములు కపిలతీర్థమునకు సమీపమున మాదిగవాని గుండములో స్నానముచేసి తిరుపతిలో దేవస్థానపు విచారణకర్తలవారి ఖచేరిలో ముడుపులఁజెల్లించి రసీదుఁబొందెదరు. మహమ్మదీయులు గూడ నీ ఖచ్చేరిలో ముడుపులు చెల్లించుటగలదు.

## అధ్యాయము II.

### 1. తిరుమల.

తిరుమల అనగా శ్రేష్ఠమైనకొండ అని అర్థము. ద్రావిడభాషయందు శ్రీవైష్ణవసిద్ధాంతములో తిరు అనునది శ్రేష్ఠవాచకము. మలై అనుశబ్దమునకు పర్వతమనియర్థము. ఈ పర్వతము తూర్పుకొండలలో నిది. 2500 అడుగులు యెత్తున్నది. తిరుమల అనెడి పేరుకంటె తిరుపతికొండనియు, తిరుపతిమలైయనియు విశేషముగ వాడబడును. ఉత్తర హిందుస్థాన దేశస్థులు త్రిపతి అని వాడెదరు. (ఈకొండకు కృతయుగములో వృషభాచలమనియు త్రేతాయుగములో నంజనాచలమనియు, ద్వాపరయుగములో శేషాచలమనియు కలియుగములో వేంకటాచలమనియు పేర్లుగలవు.) ఆపేర్లకు కారణములెవ్వన :—

(1) వృషభాచలము.

వృషభాసురుడను రాక్షసుడు కృతయుగములో నీ పర్వత మందు తుంబురకోనలోనుండి మునులను బాధించుచుండెను. ఆ మునిశ్రేష్ఠులు తమ తపస్సునకు భంగము గలుగకుండునట్లు శ్రీ మహావిష్ణువును బ్రార్థించిరి. ఈ వృషభాసురుడు తుంబుర తీర్థములో ప్రతినిత్యము స్నానముచేయుచు శ్రీనృసింహసాలి గ్రామము నర్చించుచుఁ బూజానంతరంబున ఖడ్గముతో తన శిరముఛేదించి యాశిరంబు నొక పుష్పంబుతోఁగూడ సమ ర్పించుచుండె. ఛేదించిన వెంటనే శిరంబతనికి యథాప్రకారంబు వచ్చుచుండెను. ఇటుల 5000 సంవత్సరంబు లారాధనముచేయ శ్రీమన్నారాయణుడు ప్రత్యక్షముకాఁగా నా యసురుడు దండ ప్రణామంబులుగావించి స్తుతించి తనకు మోక్షముగాని స్వర్గము గాని పరమపదముగాని అనవసరంబనుచు శ్రీ వారితో యుద్ధంబు చేయ నిచ్చగలదని విన్నవింపవల్లెయని యానతిచ్చిరి. యుద్ధ ములో నీరక్కసుడు శ్రీవారితోఁగూడ పోరాడుచు వారే రూపముదాల్చిన తానారూపము ధరించుచుండెను. విశ్వరూప ముధరించిన విశ్వరూపమును, గరుడవాహనారూఢుడుగనుండ తానునట్లుకాఁగా శ్రీవారు సుదర్శన ప్రయోగముచే శిరచ్ఛేదనం బొనర్చెనంత చక్రపాణికి నమస్కరించి సుదర్శన మహిమయిం టిని చక్రహతులకు పరమపదము నిస్సంశయము. చక్రానల దగ్ధుడగు నే నామందిరమునకుఁ బోవుచున్నాను.

శ్లో॥ ఏవముక్త్వాహరేఃపాదౌ పస్పర్శవృషభాసురః।
వరంయయాచేవృషభశ్శైలో మదభిధోస్త్వితి॥

శ్లో॥ సమాలింగ్య భవే దేవ మిత్యుక్త్వా హరిణాధసః ।
విసృష్టశ్చక్రసంభిన్న స్త్యక్త్వాన్వకళేబరమ్ ॥
అందుచే వృషభాచలమని పేరుపొందెను.

(౨) అంజనాచలము.

కేసరిభార్యయయిన అంజనాదేవి త్రేతాయుగములో పుత్రులులేమిని శోకముచే కన్నీళ్లతో శరీరమంతయు తడిసినదై మతంగమహర్షి నద్దకేగి సాష్టాంగనమస్కారముచేసి తనదుఃఖ కారణము జెప్పకొనగా మునిపుంగవుండాలించి యిట్లనియె "పంపాసరస్సునకుఁ బూర్వభాగమున 50 యోజనముల దూరముగ నృసింహక్షేత్రముగలదు. దాని దక్షిణముగ నారాయణగిరికి నుత్తరముగనున్న శ్రీస్వామిపుష్కరిణికి క్రోశడుదూరమునయున్న ఆకాశగంగకుఁబోయి 12 వత్సరములు తాపమాచరించిన నా పుణ్యఫలంబువలన సుపుత్రుండను బడయుదవు" అంత నామె మునివాక్యానుసారమునఁబోయి శ్రీస్వామి పుష్కరిణిలో స్నానమాచరించి అశ్వత్థవృక్ష ప్రదక్షిణములుగావించి శ్రీవరాహస్వామివారి దర్శనముచేసికొని యాకాశగంగకునేగి మునులయొక్కయు భర్తయొక్కయు నానతి తీసికొని ఆహారవిసర్జననియమమునుగలిగి తపమాచరించెను. కృశించిన శరీరముమాత్రముగలదై యీ ప్రకారము వ్రతముపూర్తియయినపిదప మహాబలుఁడైన వాయుదేవుఁడు వీర్యప్రపూరఫలం బొకటినియ్య నామె భక్షించెను. అంత నామె గర్భవతియై 10 మాసములయిన తర్వాత పుత్రరత్నమగు హనుమంతు డుద్భవించెను.

శ్లో॥ హనుమంతమిమం ప్రాహుర్మునయోవీతకల్మషాః ।
అంజనావ్రతమాస్థాయ పుత్రం ప్రాపగిరీశ్వరే ॥

అందుచేత నీ పర్వతరాజంబున కంజనాచలమని పేరుగలె

(3) శేషాచలము.

శ్రీవైకుంఠములో శ్రీమహాలక్ష్మీసమేత శ్రీమన్నారా యణుండంతఃపురమునందుండ శేషుడొక స్వర్ణవేత్రంబు హస్తం బునఁబూని ద్వారము నావలియుండె మహాబలుఁడగు వాయు దేవుఁడు భగవంతునిజూడ వేగముగానే తెంచుచుండ శేషస్వా రాట్టు తనవెత్తిముతోఁ బోవలదని నిరోధించెను. కార్యార్థ ముగ శ్రీవైకుంఠాధిపుని జూడవచ్చుచుండెడి నభ్యంతపర్చినందుకు కోపావిష్టుఁడై "పోవలదనుటకు హేతువేమిరా మూర్ఖా" అని పలు కగా శేషుడు "లక్ష్మీవల్లభునంతఃపురమునందుండి నేనాజ్ఞానుసారము నిచటనున్నాడను" అని ప్రత్యుత్తరమియ్య నామాటలాలించి "పూర్వము జయవిజయు లహంకారపూరితులై యిట్లు నిరోధించి నందుకు మునిపుంగవుల శాపంబుచే కుంభకర్ణ రావణాసురు లయిరను సంగతి తెలియునా?" అని వాయుదేవుఁడు జెప్ప నిరు వురకు వాగ్వాదములు ప్రబలమాయె. అంత లక్ష్మీచేఁ బ్రబోధ గావింపబడి శ్రీలక్ష్మీపతి "ఆగర్వితో నీవుఁ గలహమేమి?" అని వాయువుతోఁజెప్ప నతఁడూరకుండెనుగాని సర్పరాట్టుమాత్రము తనతోసమానము లేదనియు తాను బహు పరాక్రమశాలియ నియు ప్రగల్భములు బలుక నాత్రివిక్రముడు "నవాక్యా తేన పారుష్యంక్రియయా కేవలముత్తమమ్. మేరుపుత్రుండైన ఆనందు డుత్తరభాగమునందుండె. ఆనగంబున నొక్కరు గట్టిగాబంధించి యింకొకరు కదల్చినంతట బలాబలంబు లేర్పడును" అని యాన తియ్య నా సహస్రాననుండుబోయి చుట్టుకొని శిరంబుల గట్టిగ బట్టుకొనెను. వాయుదేవుడు దన పరాక్రమంబు చూపుచుండ

లోకము లల్లకల్లోలముగా నారంభించెఁగాని పర్వతరాజంబు చలింపదాయె. అతఁడు బహు కోపావిష్టుఁడై యింకను తన బలంబు జూపుచుండవలదని యింద్రాదిదేవతలు వేఁడిరిగాని నతఁ డొప్పమి శేషునివేడ నతఁడు లోకారాధ్యు నిచ్ఛననుగుణ్యముగా నింద్రాదుల కోరినటుల బంధనము నొకతలతో వీడ నాభూధరంబెగురఁ హిమవద్గిరి తనపుత్రుని విపత్తుచూచి వాయుభగవానుని వేడ నతఁడు స్వర్ణముఖకి సమీపమున నుంచె. వాయుదేవుఁడు సహస్రాననుని కపచారము గల్గించినట్లు తెలిసికొని క్షమాపణ గోరెను. శేషపరివృతమై శేషాంశము గల యీ పర్వతరాట్టునకుఁ నానాఁడె శేషాచలమని పేరుగల్గె.

(4) వేంకటాచలము.

కాళహస్తి నగరమున పురంధరసోమయాజియను నామంబునఁ బరఁగు నొక విప్రుండుండెను. అతఁడు వేదవేదాంగ పారంగతుఁడయ్యు పుత్రుఁడు లేనందుకు ఖేదము నొందుచుండెను. అంతనొక పుత్రుండుఁగల్గె. ఆబాలునకు మాధవుండని నామంబిడి విద్యాబుద్ధులు గరపుచుండెను. కుమారుండును నంతశీఘ్రముగ వేదశాస్త్రప్రవీణుఁడై పుత్రరత్నమని పేరొందెను. పాండ్య దేశమునఁ పుత్రికారత్నమని పేర్గాంచి చంద్రలేఖ యను బాలికను నీమాధవునకు వివాహంబు జేసిరి. వారు నిత్యమగ్నిహోత్రములు జర్పుచు కర్మానుష్ఠానము లాచరించుచు వేదశాస్త్రములు పరిశీలన జేయుచు నుండిరి. "బుద్ధిః కర్మానుసారిణీ" అనునట్లు ఒకనాఁడు మాధవుఁడు సూర్యాస్తమయముకాఁగ పూర్వమె భార్యతో సంగమించ వలెనని కోర నామె యిట్లు చెప్పె.

శ్లో. శరీర మస్థిమాంసాద్యైః పూరితం పురుషబుభిః,
శ్లో. శరీరేన శరీరశ్చసంగమస్నాధ్వసంమతః,
తత్రాపిదివసక్రీడామ యుక్తామునయోవిదుః.
శ్లో. నికేతనే పితామాతా చాగ్నిహోత్రశ్చ దేవరాట్,
ప్రభాకర ప్రభాంపశ్యత్యజకామంద్విజాత్మజ.

ఈవచనంబులాలించి మాధవుఁడు భర్తమాటవినినంతట నీకు శ్రేయస్కరమేగాక పుత్రుఁడుబడయుననిచెప్పి భర్తవాక్య పరిపాలనజేయని భార్యకు దోషంబుగల్గునని వక్కాణించెను. "నేను నీరంబుకొనుటకు మిష చేసరస్సునకుఁ బోయెద నీవు కుశా న్వేషణార్థము రమ్ము, అట నీకోరిక నెరనేర్చు కొనవచ్చును." అని చంద్రలేఖ సరస్సునకేగెను. మాధవుడు దనమిషను సరస్సు రానచట వనములో ధవళవస్త్రము ధరించిన కోమలాంగి నొక తెనుగని భార్యనింటికిఁ బొమ్మన నామె నీరంబుగొనిపోయె. వన ములోనుండు సుందరాంగిని విచారించ నిచ్ఛగలిగి "నీవెవరు ? ఎచటనుండి వచ్చితివి ? నీకులమేమి ?" అని ఆమోహనాంగి నడుగుచు దనమనోభిమతంబు తెల్లంబుచేయ "నేను మధ్యదేశ మునసుండి వచ్చిన పంచమజాతి స్త్రీని మదమాంసములు భక్షించుదానను వ్యభిచారిణి కుంతలయను పేరఁబరఁగెద. వేద వేదాంగ వేత్తవు నీకు దండమొనర్చెద, నన్ను జూడ నీవనర్హు డవు. క్రీడింపనేల గోరెదవు" అని యాస్త్రీ చెప్ప "శ్రీమహా విష్ణువునకు మూఢుఁడైన పుత్రుఁడు గల్గినందుకు విచారము. బ్రహ్మకుకన్నులులేవుగాఁ బోలు" అను మొదలగాగల పలుకు చెప్పుచు దనకోరిక నీడేరవలెనను తలంపుగల్గ నాకుంతల తన్ను

దాకినంత మాత్రమున పదిపురుషాంతరములు దహించునని హితోపదేశం బొసర్చ నతడు సముద్రములో రత్నములు దేవతలు తీసికొనరా. అట్లనే రూపలావణ్యముచే నిన్ను గోరెదను. నరకంవచ్చినను సరే” అని చెప్ప నాకోకిలస్వర రంజితాంగి బ్రాహ్మణుడు బాపసంగమముచే నశింపకుండ రక్షించవల్సినదని దేవతలను నవగ్రహములను ప్రార్థించి విష్ణునిగుఱించి యిట్లుపల్కె.

శ్లో. మాస్పృశాద్యమహీదేవ పాపినీం వ్యభిచారిణీమ్,
కస్స్పృశేదన్నిమాత్తస్సర్వంవ్యాఘ్రంగజం ద్విజ.
పరపత్న్యోహిలత్తుల్యాః కిముచండాల కన్యకా,
ఉత్తమం పదమాస్థాయ నీచాయిచ్ఛంత్యధోగతిమ్.
జ్ఞానినోనతథా విప్రతెవబుద్ధిస్తు తాదృశీ,
జాతీద్వే నిర్మితేపూర్వం విష్ణునాద్విజసత్తమ.
స్త్రీత్వం పుంస్త్వం యథాతద్వచ్చాతుర్వర్ణంచభూసుర,
బ్రాహ్మణస్య బ్రహ్మయోన్యాందంతు విచ్ఛంప్రశస్యతే.
తథాద్యేషాంచ వర్ణానాం స్వస్వజాతౌ ప్రశస్యతే,
విపరీతమిమం మన్యేధర్మత్యాగం ద్విజన్మనామ్.
శరీరంత పవిత్రేంద్ర వేదపూతం విశేషతః,
ఋతుకాలేచ యస్మాతుస్తవపిత్రా సమాగమే.
రేతస్సృష్టం వేదపూతం గర్భాధానమి దవిదుః।
సీమంతం కల్పయామాసుర్మంత్రైర్వేదమయైర్ద్విజా.
దశమేమాసినం ప్రాప్తే ప్రాసూతజన నీతవ,
తదాపిత్రా జాతకర్త కృతం నామచమంత్రవత్

అన్నప్రాశనచౌలాది బ్రహ్మావాచన పూర్వకమ్,
అగ్నిసాక్షివిధానేన ప్రాప్తదారః కృతోభవాన్.
అధీతవేదశాస్త్ర స్సన్నాహితాగ్ని స్సృతేక్షితః,
ఏతదృశస్య దేహస్యమయానంగః కథం భవేత్.
కర్ణాహరికథా శ్రుత్వాపావితౌ నాసికాతవ,
హార్యర్పిత సుగంధేన పావితా జఠరంతవ.
వాసుదేవార్పితాన్నేన పవిత్రం పురుషర్షభ,
కృష్ణార్చన ప్రసంగేనకరౌపావన తాంగతౌ.
హరినామ కలాపేన జిహ్వాతేపావనాత్మికా,
పుణ్యక్షేత్రాను చారేణపాదౌతేపావ నీకృతౌ.
ఇంక తనకులము మహత్మ్యంబు సాంగత్యదోషము

శ్లో. అవ్యాచవచనైః క్రూరైర్జిహ్వా మెహ్యాతేసదా,
సురాముం సాశనేనైవఠరే గుల్మమాగతమ్.
వ్యభిచార కథాలాపాత్కర్ణౌమే శిథిలీకృతౌ,
పాదౌజాగృహం గత్వాపాషాణ సదృశౌమమ.
గోవధాన్మత్కరౌ క్రూరౌయమిదం దనమిప్రభౌ,
ఏతాదృశస్య దేహస్య త్వయానంగః కథం భవేత్.
ఉత్తమోనీచతాం ప్రాప్య కథం స్వర్గగమిష్యతి,
పరస్త్రీ సంగదోషేణ బహవో మరణం గతాః.
శ్లో. తస్మాదుత్తిష్ఠ భద్రంతేత వదాసీభవామిభోః,
ఎంతచెప్పినను మాధవుఁడు వినక తనపూర్వ పుణ్యఫల
నాకుంతల దొరకెనన నాస్త్రీ పలాయనం బాయెనంత

నతఁడు, వెంబడించిచేకొని మన్మధహతుఁడై మీఁదఁబడెను. అది మొదలు యజ్ఞోపవీతముత్యజించి ముండనంబుగావించి అబ్రాహ్మణకృత్యమైన గోవధయు, గోమాంసభక్షణయు మద్యపానము చేయ చండాలత్వముబొంది కృష్ణవేణీతీరము నకుంతలతో 12 వత్సరంబులుండె. కుంతలపరలోకప్రాప్తిఁబొంద నతఁడు పిచ్చివానివలె తిరుగుచుండ మార్గమున నుత్తరదేశపు రాజులు పరివారంబుతో వచ్చుచుండఁయుచ్ఛిష్టంబు భుజించుచుఁ గూడ వచ్చెను. వార్లుకపిల తీర్థములో స్నానముచేసి పార్వణవిధానంబుగ పితృశ్రాద్ధముజేయ నితఁడు క్షవరంబు జేయించుకొని తీర్థములో మునిఁగి మృత్పిండములు పెట్టెను అంతపితృలు ముక్తినొందిరి. మరుదినము వార్లంపరితో గొండకువచ్చెను. తనకువమనములు విశేషముగనై దుర్గంధము హెచ్చాయెను. అచ్చటివారలేగాక యింద్రాదిదేవతలు గూడనేమి యీదుర్గంధమనుచు వచ్చిరి. అంతనొక యగ్నిపుట్టి యీదుర్గంధమును దహించె. దేవతలందఱా విప్రునిపాపంబులు బోవఁజూచి పుష్పవర్షము గురిపించి "నీవు గతపాపుఁడవైతివి. శ్రీస్వామిపుష్కరిణీస్నానముచేసి శ్రీవరాహస్వామి వారిదర్శనప్రాప్తిఁబొంది దేహముత్యజింపుము. నీవు పాండవ దౌహిత్రకులంబున సుధర్ముని పుత్రుఁడవై పుట్టి తొండమాన్ దేశాధిపతివై నారాయణ పురమును పాలించుచు నీకుమార్తె జగన్మాతను జగత్పతికిచ్చి పరమపదము పొందెదవ"ని ఆపారునకు చెప్పెను. తదాది సర్వపాపములను హరించునదగుటచే నీపర్వతంబునకు వేంకటాచలమని పేరు గలిగె.



21. శ్రీవారి బంగారువిమానము, తిరుమల.

తిరుపతి కేడుమైళ్లదూరమున నారుకొండలు దాటి ) ఏడవ కొండయగు వేంకటాచలము మీాద శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవస్థానము గలదు. ఆదేవస్థానమునకు బయట ప్రదక్షిణము నాల్గువీధుల వలె నున్నది. ఆవీధులలో సుమారు వెయ్యిమంది జనాభాగల గ్రామముగలదు. దీనికి తిరుమలని వాడెదరు.

2. శ్రీవేంకటేశ్వరస్వామివారి దేవస్థానము.

ఈదేవస్థానము అనాది అని పురాణము వల్ల నేర్పడును. శ్రీవేంకటేశ్వరస్వామివారి మూర్తియందుండు చిహ్నములు జూచి శివుడా? విష్ణువా? శక్తియా? అను సంగతి పలువురకు తోచకమానదు. శ్రీవైకుంఠమునుండి కలియుగములో జనుల నుద్ధరింపభూలోకంబునకే తెంచిన శ్రీమహావిష్ణువని చెప్పెదరు. వైఖానసమతస్థులు పూజనొనర్చెదరు. దక్షిణ ఇండియాగెజెటీరులో (South Indian Gazettee) "గుడిపూర్వచరిత్ర సరిగా తెలియక బుక్కిటు పురాణములతో నిండియున్నది. మిగుల ప్రాచీనమైన దనుటని స్సందేహముకలియుగమాదిలో గట్టబడినట్లును కలియుగాది 5000 సంవత్సరము లయినతర్వాత భూమిమీాద విష్ణుపూజ తగ్గుననియు పురాణములో జెప్పబడినట్లు వ్రాయబడినది. హిందూ రాజులు కాలములోని దేవస్థానపురాబడిగుడిలోనే మతసంబంధనమైన పనులకు (Ceremonies) వెచ్చింపబడుచుండెను. ముసలమానులకాలములో నీరాబడి రాజుల స్వప్రయోజనమునకు వెచ్చించబడుటకు ప్రారంభమాయెను." అనువగైరాలు చెప్పబడినవి. ఇప్పటికి కలియుగము బుట్టి 5023 సంవత్సరంబులాయెను. మహిమతగ్గుటకు బదులు హెచ్చుచున్నది.

దేవస్థానపు మహాద్వారమునకు పడికావలి అని పేరు. మహాద్వారము మీద నొకగోపురముగలదు. ఇచ్చట దేవస్థానపు గుమాస్తా ఒకరును కావలిభటులు నుందురు. దేవస్థానము లోపలకును, లోపలనుండు బయటకును తీసుకొని పోబడు వానిని తనిఖీచేయుదురు. పడికావలి బయటనుండి బంగారు మలాంచేయబడిన రేకుతో కప్పబడిన ధ్వజస్తంభము మొదలగు నవి కనబడును. యాత్రికులాపడి కావలిగుండా గోవిందనామ సంకీర్తనముచేయుచు వెళ్లుటచూడగ నహ్లాదకరము ప్రతివానికి నుండక మానదు.

పడికావలి దాటగానె నొకప్రదక్షిణముగలదు. దానికి సంపగప్రదక్షిణమని పేరు. ఈప్రదక్షిణమునడిమి పడికావలి అను ద్వారముగుండా దాటగా విమానప్రదక్షిణము గలదు. ఇదిగాక వైకుంఠప్రదక్షిణముగలదు. ఇది ముక్కోటియేకాదశి అనగా ధనుర్మాసములో శుక్లపక్ష ఏకాదశి ఉదయమున తెరచిద్వాదశి నాయంకాలము మూయుదురు.

## 3. వెయ్యికాళ్లమంటపము.

శ్రీవారి దేవస్థానమున కెదురుగ నీమంటపమున్నది. మంటపములోనికి వెళ్లుటకు పశ్చిమపార్శ్వమునుండి మెట్లు కలవు. మంటపమునకు పశ్చిమభాగము అంగళ్లవల్ల మూయబడినందున నుత్తరపార్శ్వమార్గము చాలయుపయోగింపఁబడుచున్నది. వెయ్యిస్తంభములున్నవని చెప్పుటయేకాని యిప్పుడంత సంఖ్యలేదు. యీమంటపములో కొంతభాగము శిథిలమై పడిపోయినందున కంబముల సంఖ్యతక్కువ.మంటపముకట్టినకాలము సరిగా తెలియదు కాని నిండపురాతనమని చెప్పుటకు సందియ



23. ధర్మశాల. (పిలిగ్రింషెడ్).

ఇది ఆళ్వారుచెరువువద్ద నున్నది. ఇది నూతనముగా యాత్రీకులు చెట్టుక్రింద వంటచేసుకొనకుండ వుండునట్లు నిర్మించబడినది. ఇదేమాదిరిగా గ్రామమున కుత్తరపుతట్టు ఒకటి కట్టబడినది వెయ్యికాళ్లమంటపముపైన ఒకటి కట్టబడుచున్నది. ఈ మూడున్ను వేలకొలది బీదయాత్రీకుల కుపయోగము.

ము లేదు. ఈమంటపము చాలభాగము యాత్రికులకొఱకు అర లుగా కట్టబడియున్నది. కొంతభాగము ధర్మశాలగా నున్నది. మంటపము యొక్క కొంతభాగము తగ్గుగాను కంబములన్నియు మోటుగాను మిగుల సమీపము గానుండుటవల్ల అంత బాగా తెలియదు. శ్రీవారిని వేంచేపు చేయుట కొక భక్తుఁడు దీనిని కట్టించినట్లు చెప్పుటయే కాని యెందుచేత వేంచేపు చేయుట లేదో కారణము తెలియదు.

4. శ్రీహాత్తిరాంజీ మఠము.

ఆగ్నేయ మూల నెత్తైన స్థలమున నీమఠముకలదు. ఈ మఠమునకు మూలపురుషుఁడు శ్రీహాత్తిరాంజీవారు. ఈయన వుత్తరహిందూస్థానములో డిల్లీకి 24 మైళ్లదూరములో నుండు కేడల్ క్రేల అను పురమునుండి వచ్చినవారు వీరు.అచ్చుటమఠాధిపతియైన అను భయనంద జీవారి శిష్యులలో నొకరు వీరు తీర్థయాత్ర చేయుచు నీక్షేత్రమునకు వచ్చి తపస్సు చేయుచుండిరి. యిక్కాలమున విజయనగరం శాలువవంశపురాజు లీరాజ్యమును పాలించుచుండిరి.వీరునుక్రీస్తుశకము 1500 సంవత్సరము లప్పుడు వచ్చినట్టు తెలియును. ఈయన మిగుల తపోనిష్ఠులు వీరు శ్రీవేంకటేశ్వరస్వామి వారితో పాచిక లాడినట్లు చెప్పెదరు. వీరు ఆకులను భక్షించుచు నుదకము పానము చేయుచుండిరి. వీరికి జరామరణములు లేవని స్వశరీరముతోనే కొంత కాలమున కంతర్ధాన మయినట్లుగా చెప్పెదరు. వీరికి చంద్రగిరి రాజు తిమ్మ రాజుగారి కుమారుడు శిష్యుడై వీరి తర్వాత మఠాధిపతిగా వచ్చెను. ఈ రాచపుత్రుడు శ్రీహాత్తిరాంజీ వారికి శిష్యుడగుటవల్ల అప్పటి రాజులు వీరి మఠమునకు ఒకసిం

హాసనమును నింకి రాజచిహ్నములగు నౌబత్ ఖానా ఘంట మొదలగునవి యిచ్చిరి.తిరుమలవిగాడనుండు రాజనగరు మఠము గ మారెను.వీరు జపముచేయుమాల యొకటిమఠములోకలదు.

ఈ మఠమునకు ఆదిస్థానము తిరుమల. శ్రీమహంతు వారు సంవత్సరములో కొంతకాలము తిరుపతిలో నుందురు. ఈ మఠమునకు తిరువానూరు, చిత్తూరు, వేలూరు, షోలింగర్, వృద్ధాచలం, తంజావూరు, మథుర, నాసిక, పంచవటి, సుగూరు, బాంబాయి, భాగల్‌కోట, కాన్పూరు జిల్లా, ముజ్జేరి జిల్లా, గుజరాత్, అయోధ్య, నాభా, మొదలగు ప్రదేశములలో శాఖలు కలవు.

తిరుమల తిరుపతి యందున్న యీమఠములలో నెంత మంది సాధువుల కయినను ఎన్ని దినములయినను బసయిచ్చి భోజన మిచ్చెదరు. మరియు ననేకులకు సదావృత్తి నిచ్చెదరు. ఈ రెండు ప్రదేశములలోను పెక్కు సంఖ్య గల సాధువులు ప్రతి దినముందురు. శిష్యార్జితము కలదు. శిష్యులు పాదకానుకలకు నివేదనలకు సొమ్ము నిచ్చెదరు.

శ్లో. సతాంధనం సాధుభిరే వభుజ్యతే
దురాత్మభిశ్చరితాత్మ నాంధనం
సుఖాధిభి శ్చూత ఫలాది భుజ్యతే
భవంతినిం బాఃఖలుకాక భాజనం.

మఠమునకు శిష్యులు కానివారు సయితము పై శ్లోకార్థ ప్రకారము కొందరు సాధు సమారాధన మొదలగు వాటికి గాను సొమ్ము యిచ్చెదరు. యిచ్చట నివేదనలు 5 విధములు.



25. తిరుమల శ్రీ హాథీరాంజీమఠము.

| | | |
|---|---|---|
| డాల్ భాత్ | ర్పు | 30-0-0 + 3-8-0 |
| ఖిచిడి (పొంగలి) | | 15-0-0 |
| శీరా పూరీ. | | 60-0-0 + 3-8-0 |
| మాల్ పూరి. | | 110-0-0 + 6-0-0 |
| పంచ మిఠాన్. | | 250-0-0 + 6-0-0 |

ఈ మఠములో గుడి దేవతార్చన గలవు. పూజారులు తెల్లవారు జామున 4, 5 గంటలకు లేచి స్నానము చేసుకొని పూజ చేయుదురు. ఈ గుడిలో సాలిగ్రామములు వందల కొలది గలవు, ఉదయము 6 గంటలకు బాల భోగము పొంగలిన్నీ మధ్యాహ్నము రాజ భోగమున్ను రాత్రి 8 గంటలకు తిరుగని వేదనయు అగును. ఇచ్చట కర్పూర హారతి చేయించ దలచిన వారు రు 1-4-0, వత్తి వెలిగించి హారతి చేయించు వారు రు 0-5-0 లున్ను చెల్లించవలయును. ప్రతిదినము మధ్యాహ్నము 5 గంటలకు సాధువులకు ఒక్క పండితుడు సంస్కృతములో పురాణము చదివి హిందూస్థానీలో అర్థము చెప్పుచుండును. ఉదయము సాయంత్రము హారతి కాలమందు సాధువులు భజనచేయుదురు. ఈమఠములో గాది అని వాడేడు సింహాసనములు గలవు. ఒకటి విజయనగరము రాజులకు నిర్మింప బడినది. రెండవది మఠము యొక్క మూల పురుషుని స్వంతమునై యున్నది. శ్రీవేంకటేశ్వర స్వామి వారి బ్రహ్మోత్సవములో తేరుదినమునను మహంతు వారు ఉపవాస ముండి తేరు యథాస్థానమునకు వచ్చిన తర్వాత తేరువద్దనుండి మర్యాదతో దయచేసి పైన చెప్పిన గాదులం దాసీను లవుదురు.

ఈ మఠములో తక్కిన మఠములోవలె విశేషోత్సవము లనేకము జరుగును. వానిలో మఠము యొక్క మూల పురుషుడంతర్థానమైన జాగాయందు వారి సమాధి కట్టబడినది. వారు వేసుకొనిన ధూనినింకను ఆరిపోకుండ కాపాడబడుచున్నది, అచ్చటనొక మఠముయొక్క సాధువుచేత ఆంజనేయ కృష్ణ విగ్రహములకును సమాధులకును ప్రతిదినము ఆకాశగంగ తీర్థము తులసి మొదలగు వానిచే పూజచేయ బడికి చిడి మొదలగు వానితో నివేదన జరుగుచున్నది. యిది తిరుమలకు మైలు దూరమున పాపవినాశని ఆకాశ గంగకుపోవు మార్గములో నున్నది.

సాధారణముగా యాత్రికులకు శ్రీవేంకటేశ్వరస్వామి వారియం దెట్టి నమ్మిక గలదో అట్లనే శ్రీహాత్తిరాంజీవారియందు మఠం శిష్యులకు నమ్మిక విశ్వాసములు గలిగి కానుకలిచ్చెదరు. శ్రీహాత్తిరాంజీవారు స్వప్నములో శిష్యులకు కనఁబడి తమ ప్రార్థనలకు నుత్తరువు నిచ్చుచుండుననని శిష్యులనేకులు చెప్పుచుందురు. దక్షిణహిందూ దేశమందు హెచ్చు సంఖ్యగల సాధువులను గలిగిన మఠమిది యొకటియే.

శ్రీ మహంతు సేవాదాస్ జీవారు శ్రీవేంకటేశ్వర స్వామి వారి దేవస్థానమును బ్రిటిష్ గవర్నమెంటు స్వాధీనము నుంచి 1843 సం॥ యేప్రియల్ తే 21 ది మద్రాసు గవర్నరు ప్రభువుగారి హుకుంను అనుసరించి జూలై తే 16 దిలో సంపాదించిరి. మనగవర్నమెంటు వారు దేవస్థానమును తమమేనేజిమెంటు నుండి ఇతరులకు నియ్య దలచు కొనునప్పుడు దేవస్థానములో నొకమిరాశిదార్ అయిన పెద్ద జియ్యంగార్ ఇంకను కొందరు

జమీాందార్లు మొదలగు వారు తమ స్వాధీనముచేయ వల్సి సట్లుగోరి దరఖాస్తులు చేసికొనినను వారి కొసగక నీమహంతు లకిచ్చిరి. ప్రస్తుతము ఈ మఠమునకు శ్రీమహంతు ప్రయాగ దాస్ జీగారు మహంతుగా నున్నారు. వీరి ప్రతినిధి (Representative) అధికారి అను హోదాలో సదా తిరుమల మఠం లోనుందురు.

## శ్రీచిన్న జియ్యంగార్ల వారి మఠము.

దక్షిణపు వీధిలో చిన్న జియ్యంగార్ల (ప్రస్తుతము అప్పన్ శ్రీనివాస చిన్న జియ్యంగార్లవారు) మఠము గలదు. తిరుపతిలోను శ్రీగోవింద రాజస్వామి వారి దేవస్థానమునకు సమీాపమున ఈ మఠముగలదు. చిన్న జియ్యంగార్లు తిరుమల మీాదనున్నప్పుడు కొందఱు వైష్ణవులకు భోజనము పెట్టెదరు. ఈ మఠము ముందు చెప్పబోవు పెద్ద జియ్యంగార్లవారి మఠము నకు జేరినది, చిన్నజియ్యంగార్లు పెద్ద జియ్యంగార్లవారి శిష్యులు. పెద్ద జియ్యంగార్లవారు పరమపదము పొందిన తర్వాత చిన్న జియ్యంగారు వారిని నామఠమున కధిఋతిగా జేసెదరు శ్రీభాష్య కార్లవారి పరంపరలోని పెద్ద జియ్యంగార్ శ్రీ వేంకటేశ్వర స్వామివారి దేవస్థానములోచేయు కైంకర్యములు అవిచ్ఛిన్న ముగా జరుగుటకు ఈమఠం శ్రీభాష్యకార్లపరంపరలో 10 వ పురుషుడైన శ్రీతిరువెంగడ రామానుజ పెద్ద జియ్యంగార్ వారి కాలములో మనవాళ మహామునుల సలహామీాద నేర్పాటు చేయబడినది. చిన్న జియ్యంగార్ వారు ఇచ్చట నున్నప్పుడు తదీయారాధనలు యాత్రికులు కొందఱు చేయించెదరు. సొమ్ము

నుబట్టి వంటకము లుండును గాని ఒక్క నిర్ధారణ రేట్లు లేవు. ఈమఠమును పెద్ద జియ్యంగార్ల మఠమున్ను దేవస్థానముకట్టడ ములు, వీర్లు కైంకర్యములు చేయుచు నుండుటకు ఏర్పాటు చేయఁబడినవి.

## అధికారివారి తోట.

పశ్చిమ వీధిలో పశ్చిమ శ్రేణిలో మొదట వేంకటగిరి రాజాగారి తోట వగైరాలుండెను-ఆతోటలో శ్రీవారిని వేంచేపు చేసి వుత్సవము జరుగుచుండెను. ఆధర్మము నిలుపబడి ఆతోట వగైరాలు శ్రీ అధికారి రామలక్ష్మణ దాసుజీ వారికి విక్రయింప బడినవి. వారు ఆతోటను తమ మఠము తోటను కలిపి పెద్ద తోటగజేసి ఒక మంటపమున్ను సత్రమున్ను కట్టించిరి. ఆ సత్రమున బసలిచ్చెదరు. శ్రీవారి బ్రహ్మోత్సవములో రాత్రి పూటయు శ్రీవారికి చైత్ర శుద్ధ త్రయోదశి మొదలు మూడుదివ సములు జరుగు వసంతోత్సవము రేయింబవళ్లు సత్రమున బ్రాహ్మణులకు ప్రతిపునర్వసు నక్షత్రమున శ్రీరాములవారు సీతా లక్ష్మణ ఆంజనేయ సమేతముగ దయచేసెదరు. వసంతోత్స ములో శ్రీవారు విచ్చేసెదరు.

## మైసూరు గవర్నమెంటువారి సత్రము.

ఈ వీధిమధ్యను మైసూరు గవర్నమెంటువారి సత్రము వైశాల్యము గలిగియున్నది. ఇది చాలకాలమునుండి యున్నది. ఈ సత్రములో నేకాదశి రోజులు తప్ప తక్కినది వసములు యాత్రికులయిన బ్రాహ్మణులకు మధ్యాహ్న మొకపూట శ్రీ వారి దేవస్థానములో నివేదన అనంతరం భోజనము వైశ్యై

దరు. వంట చేసుకొనుటకు దిగుటకు స్థలము లిచ్చెదరు. ఈ సత్ర ములో పూర్వము కొంత కాలము భోజనము పెట్టి సామానుల నిచ్చుచుండిరి.

దేవస్థానపు సత్రము.

పై సత్రమునకు ప్రక్కన సత్ర మొకటిగలదు ఇది శిథిలమైనందున దేవస్థానంవారు కట్టుటకు యేర్పాటు చేయబోవుచున్నారు.

శృంగగిరి స్వాములవారి మఠము.

యీ వీధిలో తూర్పుశ్రేణిలో చిన్నయిల్లు గలదు. ఉత్త రపు వీధిలో పూర్వము పెద్దమఠము వెరడు ఉండినది. అదిశిథి లమైన తర్వాత నిది యేర్పాటయినది. ఈ మఠమునకు దేవస్థా నంనుండి నిత్యము హారవెచ్చము (బియ్యము మామూలు) గలదు.

గోసాయి మంటపము.

వాయువ్యమూలలలో గోసాయి (అనగా రైలులేనికాల మున దేశమంతతిరిగి దేవస్థానమునకుముడుపులనుజనమును తీసుకొనివచ్చెడివారు) మంటపము చిన్నగుంటగలవు. శ్రీవారి బ్రహ్మోత్సవమునకు గోసాయి జండాలో వచ్చును. ఈజండా వూరుబయటకురాగా దేవస్థానమువారు మేళ తాళములు పంపిం చి వూరు బయటనుండి యీ గోసాయి మంటపలో ప్రవేశించు వరకూ దేవస్థానం వాయిద్యములతో పిల్చుకొని రాబడును.

## ఉత్తరపు వీధి.

### 1. హిందూస్థాన్ రామాంజీ కూటము.

ఈ వీధిలోను పశ్చిమవీధిలోను హిందూస్థాన్ రామాంజీకూటములు కలవు. ఉత్తర హిందూస్థానమునుండి వచ్చిన వైష్ణవులకు భోజనముపెట్టెదరు. హిందూస్తానీ షాహుకార్లు యీ రామాంజీ కూటములకు నిండా ద్రవ్యసహాయము చేసెదరు.

### 2. వ్యాసరాయ స్వాములవారి మఠము.

ఇదినిండా శిథిలమైయున్నది. నివాస యోగ్యముకాదు.

### 3. అర్చకులు ఇండ్లు.

ఈవీధిలో అర్చకులు నివసించెదరు. శ్రీవారి బ్రహ్మోత్సవములో తప్ప తదితరకాలములలో అర్చకులయిండ్లు చాల భాగము ఖాళీగానుండును. పూజచేయు వంతుగల అర్చకగుమాస్తాలు మాత్రము సదాయుండెదరు.

### 4. రాతితేరు.

ఈశాన్యమూలలో రాతితేరుగలదు. శిలాశ్వములు చక్రములు భూమిలో పూడియున్నవి. తేరునకు గోపురమువలె ముందు పైభాగము పడిపోయినందున ఇప్పుడు మంటపమువలె తెలియుచున్నది. ఈ తేరు పూర్వమెప్పుడో శ్రీవారి బ్రహ్మోత్సవములో నెనిమిదవరోజు ప్రస్తుతముపయోగించబడు కొయ్యతేరువలె నుపయోగింపబడుచుండె నని చెప్పెదరు.

## తూర్పువీధి.

### 1. శ్రీఉత్తరాది స్వాములవారి మఠము.

ఇది యీవీథిలోనున్నది. ఉత్తరపు వీథిలోనున్న శ్రీ వ్యాసరాయ స్వాములవారి మఠమువలె నిండా శిథిలముగ నుండక పోయినను మరమ్మతుకు తగినదిగా నున్నది.

2. శ్రీ పరకాళ స్వాములవారి మఠము.

ఇది నూతనకట్టడము. ఉత్తరపువీథిలో పడిపోయిన పాత మఠముయొక్క జాగాగలదు. నిత్యము కొంచెముమంది శ్రీ వైష్ణవులకు భోజనము పెట్టుదురు. ఇచ్చటను తదియారాధన లుగూడ జరుగును. ఇది వడహాలమఠము. దేవస్థానమునుండి నిత్యము బియ్యము వగైరా సామాను లిచ్చెదరు.

రథము.

ఇది కొయ్యతో చేయఁబడినది. ఇందు మంచికొయ్య పని చేయఁబడియున్నది. శ్రీవారి బ్రహ్మోత్సవములో ఇది చక్కగా అలంకరింపబడి 8-వ దినమున ఉదయము శ్రీవార్లు విజయం చేయగా నాలుగు వీథులు మనుష్యులవల్ల లాగబడి తిరిగి యథా స్థానమునకు చేర్పఁబడును. తేరుకుచేరి ఒకరాతి మంటపము గలదు. తేరుమీఁదకు వేంచేయుటకు ముందు శ్రీవార్లు యీ మంటపములో విచ్చేయుదురు.

దివాణము.

తేరుకు సమీపమున నొక చిన్న కట్టడము. ఇది యాత్రికులకు తగినంత కారణంమీఁద బసగా నియ్యనగును. తేరుకు సమీపమున నిదియొక దేవస్థానపు కట్టడము.

వాహన మంటపము.

ఇదియొక రాతిమంటపము శ్రీవారు వాహనారూఢు లగుటకు ముందు వాహన మిచ్చట నుంచబడును. శ్రీవారి

బ్రహ్మోత్సవములో వాహనమునకు ముందు లాగబడే బ్రహ్మ రథము ఈ మంటపములో నున్నది.

బజారు.

శ్రీవారి మహాద్వారమునకు ఇరుప్రక్కల యెదురుగను అంగళ్లుగలవు. ఇచ్చట బియ్యం కూరగాయలు వంటచెరుకు మొదలగు సామానులు వెలకు దొరుకును. బియ్యము మొదలగు సామానులు కొను యాత్రికులు పాత్రసామానుకూడ వాడుగకు ఇచ్చెదరు.

తీర్థగట్టునందు.

శ్రీవారి దేవస్థానపు ఉత్తర ప్రాకారమానుకొని తీర్థ గట్టునందు అనుపేర రాజబాటగలదు. ఇది పశ్చిమవీధిలో శంకరమఠమువద్దయు పశ్చిమ ప్రాకారము నానుకొని దక్షిణపు వీధిలో కలియును. ఈసందులో తీర్థపు రోహితులయిండ్లు గలవు. ఇది శ్రీస్వామి పుష్కరిణి గట్టు నానుకొనినసందు గనుక తీర్థగట్టుసందు అను పేరుగల్గె. గోసాయి మంటపమొకటి గలదు. శ్రీహత్తిరాంజీమఠంయొక్క మంచికట్టడములు గలవు.

శ్రీవరాహస్వామివారి దేవస్థానము.

ఈ దేవస్థానము శ్రీ వేంకటేశ్వరస్వామి వారిదేవస్థానమునకంటె పురాతనమయినదని పురాణములవల్ల తెలియుచున్నది.

తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారి దర్శనమునకువచ్చు వారందఱు మొదట శ్రీ వరాహస్వామివారి దర్శనము జేసిన తర్వాత శ్రీ వేంకటేశ్వరస్వామివారి దర్శనము చేయవల్సినది.

నివేదనకూడ ప్రతిదినము శ్రీ వరాహస్వామి వారికి జరిగిన పిమ్మట శ్రీ వేంకటేశ్వరస్వామి వారికి జరుగును. శ్రీవేంకటే శ్వరస్వామి వారిక్కడకు వచ్చినప్పుడు శ్రీవరాహస్వామివారు కలియుగము వచ్చుచున్నదని తెలిసికొని తన ప్రతాపమును తగ్గించుకొని "కలౌ వేంకటనాయకః" అనుటకు సరిగా శ్రీ వేంకటేశ్వరస్వామి వారికి సమస్తము నప్పగించెను.

## ఘంటా మంటపము.

ఇది వాహనమంటప మానుకొని యున్నది. ఇందులో ఒక్క ఘంటగలదు. ఉదయము మధ్యాహ్నము నైవేద్యములు గుడికి వచ్చినప్పుడు అందఱికి తెలియునట్లు ఘంట కొట్టబడును.

## పోలీసుస్టేషన్.

ఇది వెయ్యికాళ్లమంటపములో నున్నది. ఇక్కడకు తిరుపతి పోలీసుస్టేషనుకు టెలిఫోన్ కలదు.

## పెద్దజియ్యంగారి మఠము.

యీమఠం వైష్ణవమతోద్ధారకులైన శ్రీరామానుజా చార్యులవారివల్ల నియమింపఁబడినది. ప్రస్తుతము శ్రీ అప్పన్ గోవింద రామానుజ పెద్దజియ్యంగారు వారు మఠాధిపతిగా యున్నారు. వీరు దేవస్థానంలో ననేక కైంకర్యములు నిత్యము చేయుచు దేవస్థానం నుండివచ్చు కొన్నివరంబళ్ల ననుభవించు చున్నారు. ఈ కయింకర్యములు శ్రీ రామానుజులవారి నాట

నుండి వచ్చుచున్నది. యతికి భిక్షచేయుట మంచిదని అనేకు లీ మఠములో తదీయారాధనలు చేయించెదరు. ఇంకను రొఖ రూపముగ కానుకలిచ్చెదరు. తదీయారాధనలకు రేట్లు నిర్ధారణ లేదు. సొమ్మునుబట్టి వంటకములుండును. ఈ మఠములో కొందరు వైష్ణవ బ్రాహ్మణులకు భోజనమిడెదరు. ఇది తెంగలమఠము. తిరుపతిలో కూడ నీమఠముకలదు. సంవత్సరములో కొంతకాలము జియ్యంగార్లు తిరుపతిలోనే యుండెదరు. తిరుమలమీద నుండు ఈ మఠములో శ్రీకృష్ణుడు మొదలగు విగ్రహములు గల దేవతార్చనగలదు. ఈమఠంలో మూలపురుషుని తిరునక్షత్రం చాతుర్మాస్య సంకల్పదివసము మొదలగునవి శోభస్కరముగా చేయుదురు.

## ఆచార్యపురుషులు.

ఈ దేవస్థానమునకు ఆచార్యపురుషులు 7 మంది. శ్రీ వైకుంఠములో సప్తమ ఋషులబోలె ఇచ్చట వీరు ఏడు మంది అని చెప్పెదరు. వీరి వంశములలో పూర్వులు శ్రీవారికి భక్తి శ్రద్ధలతో కైంకర్యములుచేసిరి.

## ప్రథమాచార్యపురుషులు.

వీరు తిరుమల నంబివంశములోనివారు. ఈకుటుంబమునకు తోళప్పాచార్యుల కుటుంబమనిపేరు. తిరుమలనంబి శ్రీ వేంకటేశ్వరస్వామి వారికి భక్తి శ్రద్ధలతో కైంకర్యముచేసిరి. వీరు వడ్గలవారు.

## ద్వితీయాచార్యపురుషులు.

ఈ కుటుంబమునకు పుర్సివారి కుటుంబమనిపేరు. వీరి పూర్వులు అయిన ఆనందాళ్వార్ అనువారు శ్రీవారికి మిగుల భక్తి శ్రద్ధలతో కైంకర్యము చేసిరి. వీరు తెంగలవారు.

## తృతీయాచార్యపురుషులు.

ఈ కుటుంబమునకు కందాళ కుటుంబమనిపేరు. కందాళ అన్నా అను వారు ఈ కుటుంబములోనివారు. వీరు తెంగల వారు.

## చతుర్థఆచార్యపురుషులు.

ఈకుటుంబమునకు ప్రతివాది భయంకరము కుటుంబ మనిపేరు. ప్రతివాదిభయంకర అన్నా అనువారు ఈవంశము లోనివారు. వీరు తెంగలవారు.

## పంచమ ఆచార్యపురుషులు.

ఈ కుటుంబమునకు వీరపల్లి కుటుంబమనిపేరు. వీరు తెంగలవారు.

## షష్టమఆచార్యపురుషులు.

ధర్మపురి కుటుంబమువారు. ఆరవవారు. వీరు వడ్గల వారు.

## సప్తమఆచార్యపురుషులు.

వీరు పరవస్తు కుటుంబమువారు. వీరు తెంగలవా రు.

## మంగలికట్టు.

తిరుమల గ్రామమునకు ముందుండు రావిచెట్టుకు సమీపమున యాత్రికుల ప్రార్థనల ననుసరించి జుట్టు తీయుటకు పనిచేయు ప్రదేశముకలదు. దీనికే మంగలికట్టయని పేరు. ఆట్టి ప్రార్థనలున్నవారు పుట్టు జుట్టుతీయుటకు రు 0-4-4 న్ను యిది వరలో పనిచేయబడి మొక్కుకుగాను పెంచబడిన జుట్టుతీయుటకు రు 0-3-4 న్ను మనిషి 1-కి మంగళ్లకియ్యవలెను.

## డిస్పెన్సరి.

తిరుమల గ్రామమునకు ముందు మంచికట్టడములు గలవు. అందులో నొకటి డాక్టరు ఉండుటకును ఇంకొకటి మందులు ఇచ్చుటకు హాసుపత్రిగనున్నది. ఇందులో ధర్మముగా మందులు అందఱకియ్యబడును. ఇది దేవస్థానం శ్రీ విచారణకర్తలవారి వలన ఏర్పాటు చేయబడినది.

## భోజనము.

1. దేవస్థానములో రేయింబగలు ఎందరు దేశాంత్రులకు అయినను ప్రసాదము భోజనమున కిచ్చెదరు.

2. మైసూరు గవర్నమెంటువారి సత్రములో బ్రాహ్మణులకు మధ్యాహ్నము ఒక్కపూట భోజనమిడెదరు.

## హోటల్.

భోజనమిడు బ్రాహ్మణ హోటల్ ఒక్కటిగలదు. కాఫీ హోటల్సు అనేకము గలవు. అందులో నొకటి కొంచ్చి సారస్వత బ్రాహ్మణులది గలదు.



36. శ్రీవారి పడికావలి గోపురము, తూర్పు భాగము.



36. శ్రీవారి బంగారువాకిలి.



37. శ్రీవారి పడికావలిగోపురము, దక్షిణభాగము.

బసలు.

పై వివరించినవి గాక ధర్మార్థముగా బసలిచ్చుచిన్న ఇండ్లుగలవు. బాడుగలకును ఇండ్లుదొరకును.

## అధ్యాయము. III.

## శ్రీవారిదర్శనము.

దేవస్థానముయొక్క పడి కావలియనెడి సింహద్వారపు తలుపులు ప్రాతఃకాలమున హరికొలువను మంగళవాద్యమైన పిదప తెరవబడి అర్చకులు వచ్చువరకు యాత్రికులను లోపలికి వెళ్లనియ్యరు. (అనఁగా లోపల తుడుచుట, లేక ఊడ్చుట, శుద్ధి చేయుట వగైరా పనులు అయ్యేవరకు అని అర్థము.) ఉదయము 6, 7 ఘంటలకు దేవస్థానపు గర్భాలయముయొక్క బంగారువాకిలి అనే మొదటి ద్వారపుతలుపులు తీయిబడును. అర్చకులు వచ్చునపు డందఱికిఁ దెలియునట్లు ఒక్క ఘంట వాయింపఁబడును. దేవస్థానము పారుపత్యదారు ఉత్తరువు ప్రకారము బంగారువాకిలి తలుపులు తీసినవెంటనే గొల్ల, అర్చకులు, జియ్యంగార్లు లోపలికివెళ్లి తలుపులు మూసు కొని శయనమునకు విజయంచేసిన శ్రీవారిని యథాస్థానా సీనులుగఁజేసి హత్తీరాంజీమఠమువారు తెచ్చిన ధారోష్ణము పాలు అరగింపుచేసి తలుపులు తిరిగి తీసెదరు. అంతవరకు లోపల అర్చకులును జియ్యంగార్లును, బయట ఇతరకైంకర్యపనులును సుప్రభాతమనెడు మంగళశ్లోకములను చెప్పుచుందురు. తరువాత తలుపులు తెఱువ లోపలకువెళ్లి సుప్ర

భాతము జెప్పుచుండఁగ స్థలాచారప్రకారము కైంకర్యపరులు తీర్థప్రసాదములను స్వీకరించెదరు. మంచము పఱుపు మొదలగుసామానులు వెలుపలకుఁ దేఁబడును. కొప్పెరయుఁ గట్టఁబడును. ఈలోపున కైంకర్యపరులు తప్ప ఇతరబ్రాహ్మణులను సహా వదలుట దుర్లభము. స్త్రీలు మొదలగు వారి మాట చెప్పనక్కఱలేదు. అనంతరము విశ్వరూపదర్శనమననే ధర్మదర్శన ప్రారంభమయి విశేషద్రవ్యము శ్రీవారికి చెల్లించినవారు మొదలగు కొందఱిని ముందుగ గేట్ద్వారా వదలి దర్శన మయిన తఱువాత తడవకు కొంతమందివంతున ప్రతిసారియు దర్శనమునకు నితరులను ఘంటల గేట్ద్వారా వదలెదరు. గేట్ గుండా దేవస్థానపు వుద్యోగస్థుల ఉత్తరవు లేనిది అచ్చట నుండు పహారాజవాన్ లోపలకు వదలడు. ఈసంగతి గమనించక గొందఱు అచ్చటనుండు జవాన్‌తో కొట్లాడెదరు. ఈప్రకారము ప్రతితడవ దర్శనమునకు కాచుకొనియున్న యాత్రికులకు శ్రీవారి దర్శనమవును. యాత్రికులలోఁ గొందఱుశిఫార్సుజాబులు పారుపత్యదార్ మొదలగు తిరుమల వాసులకుఁ దెచ్చెదరు. పారుపత్యదార్‌కుగాక యితరులకు వచ్చు జాబులమను నతఁడే సౌకర్యము చేయవలసియున్నది. వీరిలో కొందఱు పత్రిక దెచ్చిన కారణమాత్రముచేతనే తమకుఁబత్రికఁగ్రైకొనువారు భృత్యులని దలఁచి వేఁడినీళ్లు, కాఫి, భోజనము అవేళలందుదర్శనము పరుండుటకు పఱుపులు, దిండ్లు ధర్మార్థము బసనిచ్చు ఖాలీఇండ్లు లేనప్పుడుగూడ బాడుగలేకనే ఇండ్లు మొదలగు వానినిఁగోరి నిర్బంధముఁజేయక ప్రవర్తించుట ఉత్తమము. జాబులులేనివారికి సహితము తగినంత సౌకర్యము పారుపత్యదార్ చేయును. ఇది

ధర్మ దర్శనమయినందున ఎంతమాత్రము సొమ్ము దర్శనమునకు ఖర్చు పెట్టనవసరము లేదు. ఒక్కవేళనట్టి దుర్బోధనఁ జేయు వారుండిన యెడల దేవస్థానము పారుపత్యేదార్ వద్దకు తీసుకొని వచ్చినపక్షమున తగినచర్య జరిపింపఁబడును. శ్రీవారికి హారతి చేయించఁగోరువారు హారతి 1-కి రు 1-0-0 వంతున దేవస్థానం పారుపత్యదార్ కచ్చేరిలో షరాబు (Shroff) వద్ద చెల్లించి హారతిచీటి పుచ్చుకొని సన్నిధికి వెళ్లినప్పుడు అప్పటి తెండు అనఁగా గుంపులోపలకుఁ బోకుండఁగ వేసిన కఱ్ఱలవద్ద నిల్చుండిన సన్నిధి హర్కారా అనే బ్రాహ్మణునివద్ద నిచ్చిన హారతి చేయించును గానిటిక్కెట్టు కొనినంత మాత్రముచేత నాధిక్యతలేదు. ఈవిశ్వరూపదర్శనకాలములో నిచ్చిన తీర్థము రాత్రి శ్రీవారికి బ్రహ్మారాధన చేసినదని చాల విశేషముగ నెంచఁబడును. యాత్రస్థులసంఖ్యనుబట్టి ఘంట లేక రెండు ఘంటలు విశ్వరూపదర్శనకాలమునకు నొసంగఁబడును. బంగారు వాకిలిలోగ [గర్భాలయమునకు మొదటి బయటవాకిలి] షరాయిధరించినవారిని వెళ్లనియ్యరు. ఆయుధములుచేతికర్రలు తోలు మొదలగు వానిని ధరియించి యుండినయెడల పడికావలిలోనె వదలవలెను. అట్లుచేయనియెడల బంగారు వాకిలి లోగా వదలరు. ఘోషాస్త్రీలకు తోమాలసేవ అభిషేకము అర్చన ఏకాంతసేవ దర్శనములు దప్ప నితర దర్శనకాలములలో ముఖ్యులను మాత్రముంచి యితరులు లేకుండఁగ దర్శనము చేయిటకు విచారణకర్తల వారు లేక పారుపత్యేదార్ ఏర్పాటు చేయించుదురు. ఘోషాస్త్రీల మేనా లేక సవారిపడికావలిలోపలనున్న రాయలుమంటపములో శ్రీకృష్ణదేవరాయ

లు వారిభార్యలు తమ్ముఁడుయొక్క ప్రతిమలుగల మంటపము లోదింపవలెను. ఇందుకు విచారణకర్తలవారి వుత్తరవు గావలెను. అచ్చటనుండి ఘటాటోపము లేక ఖణితి పరదా అనెడి ముసుకులో బంగారు వాకిలివరకు వచ్చి యచ్చటనుండి లోపలకు ముసుకు లేకుండఁగ వెళ్లవలెను.

దర్శనకాలములో యాత్రికులు లోపల నొకవేళ సొమ్ము వేయఁదలఁచి నంతట తండువద్ద కులశేఖరపడి అనె వెండిగడపమీఁద మొహరులతో బీగముగలిగి పైమూత మీఁద రూపాయపట్టుటకు రంధ్రముగలిగి యుండు చిన్న పెట్టెలో వేయవలెను. ఇచ్చట పహారాగలదు. ఎవరిచేతికిని సొమ్ము నియ్యకూడదు. లోపలధర్మార్థ మెవరికి నేదియు నియ్యకూడదు. ధర్మదర్శనకాలములో నొక్కొక్కతడవకు కొంతమంది దర్శనమునకు వదలునపుడు మగవాండ్రను వేఱుగను నాఁడువాండ్రను వేఱుగను వదల వలసినదని కొందరు చెప్పెదరుగాని తాముమాత్రము తమ ఆఁడవాండ్రను వదలి ప్రత్యేకముగ దర్శనముచేయుటకు సమ్మతింపరు. ఇదేమాదిరి ఇతరులును అభిప్రాయపడి ఆఁడవాండ్రను వదలి వెళ్లరనె సంగతి గ్రాహ్యము. ఇందుకు నొకదృష్టాంతము చెప్పెదను. రయిలులో నాఁడవాండ్రకు ప్రత్యేకమొక బండియున్నను నచ్చటఁ గూర్చుండఁబెట్టక ననేకులు తమ యాఁడవాండ్రను తమతో గూర్చుండఁబెట్టుకొనుటఁ జూడలేదా! కావున నిది జనుపుట యాత్రస్థులను కష్టపెట్టుటని యెఱుఁగవలయును. అయినను కొన్నివేళల నిది జరుపబడుచున్నది.

## శుద్ధి.

పై దర్శనమయిన పిదప శుద్ధిచేయఁబడును. శుద్ధియన గా శుభ్రపరచుట. దీనికి నఱఘంటపట్టును. ఈసమయమున పాత్రలు, (Flooring) నట్టిల్లు బాగుగ శుద్ధిచేసి ముందు జరుగబోవు సేవకు పాత్రలలో నాకాశగంగ తీర్థము నింపి యుంచెదరు. ఈసమయమునందు లోపలఁ బనిజేయు సేవకులు దప్ప నితరులు పోఁగూడదు.

## తోమాలసేవ.

ఇది శుద్ధి అయినవెంటనె ఆరంభమవును. ఇది శ్రీవారి కారాధనమై పుష్పమాలలు సమర్పించెడి సేవ. ఈసేవఁజేయించువారు దేవస్థానము పారుపత్యదార్ ఖచ్చేరిలో పరాబువద్ద రు 13-0-0 లుచెల్లించి యొక టిక్కెటు తీసుకొనవలయును. టిక్కెటు 1-కి అయిదుమంది వంతున వదలెదరు. హెచ్చువదల రు. శ్రీవారి బ్రహ్మోత్సవము, నవరాత్రోత్సవములలో మాత్రము నల్గురు వంతున వదలఁబడుదురు. అంతిగాక నమంత్రణోత్సవము, బ్రహ్మోత్సవము జరిపించుటకు రూపాయలు చెల్లించినవారిని సాధారణదివసములలో 10 మంది మొదలు తరగతివారి బ్రహ్మోత్సవమును బట్టి వదలెదరు. ఇట్లు సొమ్ము చెల్లించిన వారందఱు సేవారంభము మొదలంత్యమువరకునుం డవలసినందున నొకప్పుడించుక జనస్తోమ మర్చన, ఏకాంత సేవలలోవలెఁ గల్గును గాన నట్టిస్తోమములేకుండ దర్శనము గోరువారి మనోరథము సిద్ధించుట దుర్లభము. ఈసేవలో శ్రీ భోగ శ్రీనివాసమూర్తి వారి కభిషేకమగును. శ్రీమూలపరుల

నిజపాదదర్శన ప్రాప్తి గల్గును. శ్రీవారికారాధనయయి తో మాలలచే నలంకరించెదరు. ఈసేవలో వేదపారాయణము, ద్రవిడ ప్రబంధపారాయణము జరుగును. ఈకాలములో గద్వాల్ రాజుగారి నేతిదివిటీలు వెల్గును. హత్తీరాంజీమఠము యొక్కయు, మైసూర్ సంస్థానము యొక్కయు మనుష్యులు చామర కైంకర్యముఁ జేయుదురు. సేవాంత్యమున దేవస్థానపు హారతి ఒకటి అయిన తరువాత గృహస్థుల హారతి టిక్కెట్లకు హారతిచేయఁబడును. వెంటనె యాత్రికులు వెలుపలకు రావలెను.

## కొలువు.

ఈపదమున కిచట దర్బార్ అనియర్థము. శ్రీవారికుల శేఖర పడివద్దనుండి వెండి ఖుర్చీలో శ్రీకొలువు శ్రీనివాసమూర్తివారు దేవస్థానముయొక్కయు, గద్వాల్ రాజుగారి యొక్కయు వెండి నెయ్యిదివిటీలు ముందుచు ముందురాగా రంగ మంటపము అనఁగా బంగారువాకిలి ముందుండు మంటపము లోనికి శరారి సయిలెముగా విజయంచేయుదురు. శ్రీమైసూర్ మహారాజుగారిచే సమర్పింపబడిన బంగారుగొడుగు వారివల్ల నియమించబడిన బ్రాహ్మణునిచేఁ బట్టబడును. అప్పుడు లఘువు గానారాధన చేసిర్పు 0-2-0లు రొఖము, 16 శేరుల బియ్యము నూనెయు సర్చకులకు దేవస్థానమునుండి దానమిచ్చెదరు. దేవస్థానమునుండి ఖర్చుపడు నువ్వులు, శొంఠి వేయించి పొడి చేసి బెల్లముతో కలిపి నివేదన చేయఁబడును. పంచాంగ శ్రవణ మయి గతదినపు చిఠాశ్రీవారికి శ్రుతపరుపఁబ

డును. దేవస్థానపు స్వంత నవనీతహారతి, శఠారియయి ప్రసాదము స్థలపద్ధతి ప్రకారమువినియోగమవును. శ్రీవారు సన్నిధిలోనికి దయచేసెదరు. ఈకొలువు శ్రీవారిబ్రహ్మోత్సవపు ధ్వజారోహణదివసమున నిల్పఁబడి దీపావళి కారంభమవును. ఈకొలువు కాలములో హత్తీరాంజీ మఠపు సాధువు శ్రీవారికి చామరము వేయును.

## అర్చన.

కొలువు అయిన పదినిమిషములకు తులసి సహస్రనామార్చన ఆరంభమునకు ముందర్చన చేయించువారిని (అనగా పారుపత్యదార్ ఖచ్చేరిలో రూ 7-0-0 లు చెల్లించి అర్చన టిక్కెట్ తీసుకొనిన వారిని) టిక్కెట్ 1-కి 4మందివంతున (శ్రీవారి బ్రహ్మోత్సవము, నవరాత్రోత్సవములలో 3మందివంతున)వదలెదరు.బ్రహ్మోత్సవముఆమంత్రణోత్సవము గృహస్థులను వదలెదరు. అర్చన గృహస్థులారంభము మొదలంత్యము వరకు లోనుందురుగాన నొకప్పుడు జనస్తోమముండును. తోమాలసేవ, ఏకాంతసేవలలో వలె గృహస్థులాతుర పడక సావధాన మనస్కులై ఒకరికొకర సౌకర్యముగలుగకుండ మనిషి మనిషి కెడము విడచివరుసలుగా నిల్చుండిన నందఱకు చక్కగా దర్శనమవును. ఎన్ని అర్చన టిక్కెట్లున్నను లేకున్న నొకసారి మాత్రము సహస్రనామార్చన లేక నక్షత్రనామార్చన తోమాలశేవ, ఏకాంతశేవలవలె జరిగి అర్చనగృహస్థులకు గోత్రనామములతో నాశీర్వాదముసేయుదురు. తోమాలసేవయందు, ఏకాంతసేవయందును ధర్మదర్శనకాలములలోవలె

నిప్పుడును యాత్రికు లెవరికి సొమ్ము లోపలనియ్యఁగూడదు. ఈసేవలు, ఉత్సవములు మొదలగువానికి టిక్కెట్టుకుగాను కచ్చేరిలో నిచ్చిన సొమ్ముతప్ప వేరేనియ్య నవసరము లేదు. ఇతరసేవలలోవలె హారతి టిక్కెట్ యాత్రికులు కచ్చేరిలో కొనుక్కొని సన్నిధిలో నిచ్చినంతట హారతి జరుగును. అనంతరము యాత్రికులు వెలుపలకు రావలయును.

అర్చన, ఏకాంతసేవ, తోమాలసేవలకు సొమ్ము చెల్లించిన గృహస్థులను (బ్రహ్మోత్సవము నవరాత్రోత్సవము మొదలగు విశేషదివసములఁ దప్ప) దేవస్థానమునుండి మనిషివచ్చి సేవకురమ్మని పిల్చును. ఆలస్యముచేసినంతట నిరీక్షింపరు. సేవలకు టిక్కెట్లు దీయువారు దిగినజాగా గుర్తుబాగుగఁజెప్పవలెను. దేవస్థానపు మనిషి తమజాగాకు వచ్చినపుడు గృహస్థులు లేనంతట సేవలు వారికిగాను నిల్పఁబడవు.

తరువాత లఘుశుద్ధి అయి నివేదనకుపోటు అనెడి వంటశాలనుండి పక్వపదార్థములుగల గంగాళము లెత్తెదరు. నివేదనకాలములో ఖచ్చేరిప్రక్కనునుండు రెండుపెద్దఘంటలు మ్రోగించెదరు. ఇది సాధారణముగ మధ్యాహ్నము 12 ఘంటలప్పుడవును నివేదనలనుగురించి "ప్రసాదములు"నె హెడ్డింగ్ లో వ్రాయఁబడినది. ఈఘంటనిల్చిన తరువాత చుట్టు దేవతలనఁగా పరివారదేవతలకారగింపయి జియ్యంగార్లు మొదలగు కైంకర్యపరులు శాత్తుమొరకు లోపలకు వెళ్లి ద్రవిడప్రబంధముఁ బూర్తిఁజేసి తీర్థప్రసాదములఁ దీసుకొని వచ్చిన తరువాత ధర్మదర్శనమవును.

## ధర్మదర్శనము.

దీనిని ఘంటదర్శనమనియు, మధ్యాహ్న దర్శనమనియు ననెదరు. ఉదయము విశ్వరూపదర్శనమువలె నిదియు ఉచిత దర్శనము. యాత్రికులు లాభార్థపదకే నిదానముగా దర్శనము చేసుకొనవలయును. దర్శన మునకు కయ్యేవారు మామూలుగా నుండును. కావున కొండలు పలావీల (అనగా యాత్రికుల నాశ్రయించువారివలె సంచరించువారు) పనికి వ్రాసులు విని సొమ్ము వృథాగా ఖర్చుపెట్టంగూడదు. సంపులో పోయిన వస్తువులు పేష్కారు సత్యదారులతోఁ జెప్పుకొనిన యెడల సాధ్యమైనంత సౌకర్యముఁ జేయించును.

ధర్మదర్శనకాలములో శ్రీవారి దర్శనమునకు లోపలికి వెళ్లినవారు తీర్థము శఠారి మొదలగునవి అయిన తరువాత వెంటనే బైటికి రావలెను. ఎవరికి వారు కొంచెము కాలములోపల నిలువఁబడి బయటికి రావడములో నాలస్యముఁ జేసినంతట నహోరాత్రములు పనిఁజేసె నర్చకులకును తనువలె దర్శనమునకు కాచియుండెడి యాత్రికులకును శ్రీవారి ముందు కార్యములకు నిబ్బంది గలుగును. గనుక నీ సంగతి ప్రతివారును గమనించవలెను. సాధారణముగా నీ ధర్మదర్శనకాలములో హుండి విప్పి పరఖామణికి ప్రారంభము చేయుదురు.

ధర్మదర్శనమైన తరువాత వచ్చు విశేష సేవలకు సొమ్ముఁ జెల్లించి రసీదు తీసుకొనినవారు ధర్మార్థముగా విశేష

సేవలు జేయింపుమని పారుపత్యదారు హింసించు టుత్త ముము గాదు.

## అర్చన.

పైన వివరించిన ప్రకారము ఘంట దర్శనమైన తఱువాత శుద్ధిఅయి అష్టోత్తర నామార్చన అవును. రు. 7-0-0లు చెల్లించి అర్చన రసీదు తీసుకొనిన గృహస్థులను సహస్ర నామార్చనలో చెప్పిన రీతిగ వదలి అర్చన జరుపఁబడును.

## నివేదన.

తఱువాత శుద్ధి, రెండవఘంట నివేదనఅయి పరివార దేవతలపైకి శ్రీభాష్య కార్యులవారికి మాత్రము శ్రీవారి ప్రసాదము అరగింపయి బంగారువాకిలి తలుపులు వేయఁగ నర్చకుడు మొదలగు లోని కైంకర్యపరులు బస కేగెదరు.

ఆర్జితోత్సవము లనఁగా గృహస్థులు సొమ్ముఖచేరీలోఁ జెల్లించి చేయించెడి యుత్సవము లివుడు జరుగవలసినదిగనుక నుత్సవరులు వాహన మంటపమునకు మేళతాళముతో విజయము చేసెదరు. ఉత్సవములగుఱించి ప్రత్యేకముగఁ చెప్పంబడును. ఎండ చల్లబడినప్పుడున్ను, వర్షము లేనప్పుడున్ను జరుగును.

## రాత్రిదర్శనము.

తిరుగ నర్చకులు, స్నానముచేసుకొని సంధ్య వేళలోను నార్జితోత్సవములుకాఁగా వచ్చి పారుపత్యదార్ ఉత్తరవుఁ బొంది బంగారువాకిలి తీసి శుద్ధి, తోమాలసేవ, అర్చన, నివే

దనఘంట జరుగుపుదురు. తోమాలసేవ, అర్చనరహస్యముగ జరుగును. ఎవరిని వదలరు. నివేదనఘంట తరువాత మధ్యాహ్నమునకై ధర్మదర్శనముండును. వెంటనే కొప్పెరవిప్పి యందలిసొత్తులను సంచిలోవేసి సీల్లుచేసి భద్రముచేసి మఱుదినముదయమునఁగట్టి మధ్యాహ్నము విప్పగా నేర్పడిన కొప్పెరలోని ముడుపులతోఁ జేర్చి పారుపత్యదారి ఖచేరిలో పరఖాంమణి చేయఁబడును.

## ఏకాంత శేవ.

రాత్రికొప్పెర విప్పినపరువాత శుద్ధి అయి మంచము వెండిగొలుసులతో జోడించి శ్రీపాదచందనము, పాలు, పండ్లు మొదలగునవి సన్నిధిలోనికి తీసుకొనిపోయిన వెంటనే తీర్మానమనఁగా ఏకాంతసేవకు నుత్తరవీయఁబడును. అప్పుడు సన్నిధిలో శ్రీరాములవారి సన్నిధియనఁబడు రెండువహోలు తలుపులుమూసి అర్చకులు మాత్రముండి శ్రీభోగశ్రీనివాసమూర్తి వారిని జోడించిన వెండిమంచము వెల్‌వెట్ పఱుపుమీఁద శయనాసీనులఁగఁజేసి పాలుపండ్లు మొదలగునవి యారగింపుజేసి తలుపులుతీసినవెంటనె ఏకాంతసేవకుగాను రు 13-0-0లు పారుపత్యదార్ కచేరిలో చెల్లించి టిక్కెట్టుతీసుకొనినవారిని, ఆమంత్రణోత్సవము, బ్రహ్మోత్సవము, గృహస్థులను లెఖ ప్రకారము లోపలకు వదలెదరు. ఏంకాతసేవ టిక్కెటు 1-కి బ్రహ్మోత్సవములోను, నవరాత్రోత్సవములోను నలుగురను తక్కిన దినములలో 5 మందిజనమును వదలెదరు. వీరందఱు బంగారువాకిలిదాటి స్థపనమంటపమును మొదటి హాలులో

నిలచియుండవలెను. అప్పుడు సామానులు దేవస్థానమునుంచి ఈయబడిన తరిగొండ వారిచేఁ దేఁబడు ముత్యాలహారతి జరుగును. ఇతరహారతులను జేయరు. ఈహారతితట్టలో (అనగా పళ్లెరములో) రూపాయవేసినంతట దానిని జరిపించినట్లు భావము. ఆరూపాయ వెంటనే పారుపత్యదార్ వద్దకుఁ దేఁబడి దేవుని ఖజానాకుఁ జేరుటకు డబ్బిలో వేయఁబడును. హారతి అయిన తరువాత పాలు, పండ్లు మొదలగునవి వినియోగము జేసి అందరిని బయటకుపంపి అర్చకులు, జియ్యంగారులు లేక నేకాంగులు సన్నిధిలో దివిటీపట్టు గొల్లలోపలనుండి తలుపులు వేసుకొని శోధనచేసుకొని బయటికేగెదరు, సన్నిధిలో కైంకర్య పరులు బంగారు వాకిల బయటకు వచ్చినప్పుడు నిబంధనప్రకారము ఇప్పుడును బంగారువాకిలి హార్కారాశోధన చేసివదలును. అనంతరము బంగారు వాకిటికి బీగమువేసి మొహర్లు చేసి పారుపత్యదార్ బావాజి సహితముగా మొహరులు, బీగములు చూచుకొని ప్రాకారములలో నితరులులేకుండఁగఁ జేసి పహారావాండ్రకు స్వాధీనపరచి పడికావలి తలుపులువేసి బయటికి వచ్చును.

ఈఏకాంతసేవలో శ్రీవారికి సమర్పణయిన చందనము మరుదినము దర్శనములో యాత్రికుల కిచ్చుటకు కొంతకల్పి పూసుకొనుటకు ఇయ్యబడును. కొంచె మర్చకులకుఁ జేరును. కొంతభాగము దేవస్థానము పారుపత్యదార్ వద్దకు రాఁబడి ధర్మార్థము ఖర్చుపెట్టఁబడును.

ఈప్రకారము ప్రతిదినము బీదసాదలయుపయోగార్థము ధర్మదర్శనములు, విశేషదర్శనములు త్రికాలములందును

గలవు గాని గురువారమురాత్రిమొదలు శుక్రవారపు సాయం కాలమువరకు ధర్మదర్శనము లేదు.

గురువారము.

గురువారపు మధ్యాహ్నము మొదటిఘంటకు ధర్మ దర్శనమయిన తరువాత తిరువాభరణము మొదలగునవి తీసి ఒకధోవతి ఉత్తరీయముమాత్రము శ్రీవారిమేనియందుంచి నేత్రాచ్ఛాదనముగనున్న పచ్చకర్పూరపు తిరుమణికాపుసన్న గింపఁబడును. తరువాత మామూలుప్రకారముగ రెండవ ఘంటకాఁగానే తలుపులు వేయఁబడును. తిరుగ సాయంకాల ము తలుపులుతీసి శుద్ధిజేసిన పదంపడి యమునోత్తరయనఁబడుఁ బూలయఱనుండి తోమాలలు మేళతాళములతో తెచ్చిపూలం గియనే రాత్రియలంకారమునకు వస్త్రాభరణంబుల నలంక రించి యుండ తోమాలశేవ, అర్చనఘంటయు నను నివి య వును. దీనికే పూలంగిసేవయని పేరు. పారుపత్యదార్ ఖచే రిలోపరాబువద్ద టిక్కెట్ 1-కి ఒకరూపాయిచొప్పున చెల్లించి పూలంగిదర్శనము టిక్కెట్లుకొని టిక్కెట్టు 1-కి ఒక మనిషి ంతునలోపలికి వెళ్లవచ్చును. వెళ్లినపుడు బంగారువాకిలి వద్ద తనిఖీచేయుచున్న పారుపత్యదార్ వద్ద టిక్కెట్ ఇచ్చి శ్రీవారిదర్శనమునకు వెళ్లవలెను. పూలంగిదర్శనము ధర్మ దర్శనము గాదు. ఈదర్శనమయిన తరువాత శుద్ధి, తీర్థానము అవును. పూలంగిశేవ చేయించినవారికి పూలంగిదర్శనమునకు టిక్కెట్ కొననవసరములేకుండగ కొంతమందిని లెఖ్ఖప్రకా రము వదలెదరు.

## శుక్రవారము.

శుక్రవారమురోజున ఉదయము తలుపులుతీసిన వెంటనే ధర్మదర్శనములేక పూలంగి విశ్వరూపదర్శనమనె రాత్రి పూలంగిదర్శనమే యవును. రాత్రివలెనే ఇప్పుడును ధర్మదర్శనము గాదు. ఈదర్శనమయిన తరువాత నీపూలంకారము తీయఁబడి తిరుగ మధ్యాహ్నపు ఘంట అయి అభిషేకము ఆరంభమగువరకు ఎవరికిని దర్శనము లేదు. మధ్యాహ్నపు ఘంట, శాత్తుమొర అయి సన్నిధిలో నభిషేకమునకు సిద్ధము చేసుకొని పాలుతీసుకొని వెళ్లిన తరువాతఁ బరిమెళపుఱలోనుండి పచ్చకర్పూరము, కుంకుమపువ్వు, కస్తూరి, పునుఁగుదైలము శ్రీ జియ్యంగార్లవారును, శ్రీవిచారణకర్తలవారును లోపలకు మేళతాళములతో విమాన ప్రదక్షిణముగఁ దీసుకొని వెళ్లి అభిషేకమునకు ఆరంభము చేయుచుండఁగ రూపాయి 1-కి టికెట్ వంతున పారుపత్యదార్ ఖచేరిలో మరాబువద్దకొని టిక్కెట్ 1-కి ఒకమనిషి చొప్పున యాత్రికులు శ్రీవారి అభిషేకదర్శనమునకు వెళ్లవలెను. ఈదర్శనమునకుఁ దడవకుఁ గొంతమంది వంతున వదలుటకు వీలులేదు. టిక్కెట్‌కొనినవారభిషేకము ఆదిమొదలు అంత్యమువరకు నుందురు. గనుక జనస్తోమముగ నుండవచ్చును. యాత్రికులు ఆతురతవలన జనస్తోమము అంతగ లేకపోయినను ముందుకువెళ్లి దర్శనముఁ జేసుకొనవలె ననెడి యభిలాషచేత సరిగా నిలువకపోవుటవలనఁ గొంత యిబ్బంది కలుగును. అట్లు కలుగకుండ ప్రవర్తించుట యాత్రికులకు సౌకర్యమే గాక దేవస్థానపు అధికారస్థులకును

సుఖము అనే సంగతి తెలుసుకొనవలయును. ఈదర్శనమునకు మొదట అనఁగా నార్జిత సేవలలో వివరింపఁబోవు పుళికాపుసే వలకు సొమ్ము చెల్లించువారిని లెఖ్ఖ ప్రకారము టిక్కెట్లు వేరే కొన నవసరము లేకుండఁగ వదలెదరు. అభిషేకము చేయించు గృహస్థులకు ఒకగిన్నెలో నభిషేకపరిళేషయుంచి ఇచ్చి మేళతాళములతో పరిమళమును సన్నిధిలోనికి తీసుకొని వెళ్లినపుడు వీరిని తీసుకొనికూడ వెళ్లెదరు. దీనిని గురించి యార్జిత సేవలలో వివరముగఁ జెప్పఁబడినది.

అభిషేక కాలములలో యాత్రికుల సౌకర్యమునకుగాను వృద్ధులు, పిల్లలు లోపలకు ఈ దర్శనమునకు పోవుట మంచిది గాదని దేవస్థానము విచారణకర్తలవారు నోటీసు ప్రచురించియున్నారు. దానిని యాత్రికులు బాగుగ గమనించవలెను.

శ్రీవారికిముందు పాలతోను. దరువాతఁ దీర్థముతోను అభిషేకమయి నూరిన కేసరి సమర్పణయయిన వెనుక తిరుగఁ దీర్థముతో నభిషేకమవును. పసపుతో వక్షస్థల లక్ష్మియగు అమ్మవారికి అభిషేకమవును. వెంటనే నీరుతిరుమణి సమర్పించి పచ్చకర్పూరము హారతి అయి నవనీతము, తాంబూలము ఆరగింపు కాగా యాత్రికులు బయటికిరావలెను. హారతి చీట్లుగల యాత్రికులు హారతి చేయించి బయటికివచ్చెదరు. మఱికొందఱు శ్రీవారి అభిషేకమైన తఱువాత నలంకారమునకు హారతులవలన నాటంకము సేయుట యపచార మని హారతు లప్పుడు చేయించక అలంకార మయినతఱువాత దర్శనకాలమున జే

యించెదరు. పిమ్మటసన్నిధిలో శ్రీపాదరేణువ కలుపఁబడి కొంత భాగము వచ్చే శుక్రవారమువరకు వినియోగమునకు దేవస్థానపు పారుపత్యదార్ వద్దకు వచ్చును. కొంత భాగము జియ్యంగార్లకుఁ జేరును. స్వల్పముగ ఇతరకైంకర్యపరులలో కొందఱికి ఇయ్యఁబడును. పారుపత్యదార్ వద్దనున్నది వచ్చేశుక్రవారము వరకు ఖర్చుపోను మిగిలినంతట గౌరవార్థము కొందఱు ఉద్యోగస్థులు మొదలగువారికి నియ్యఁబడును. శ్రీవారికి కేసరి సమర్పణమయిన వెంటనే యభిషేకతీర్థము క్రిందఁబడకుండఁగఁ బట్టఁబడును. ఈఅభిషేకదీర్థము యాత్రికులు ఇంటికి తీసుకొనిపోవుటకు కోరినంతట పారుపత్యదార్ ఉచితముగ నిప్పించును.

అభిషేకానంతరము పూర్తిగ నలంకారమయిన తఱువాత శ్రీవారి స్వర్ణతాయార్లవారికి నభిషేకమవును. ఇదిరహస్యము. ఇతరులు పోఁగూడదు. ఆఁడవాండ్రమాటఁజెప్ప నక్కఱలేదు. ఇదియయిన తఱువాత నిత్యము పొమ్ముఁజెల్లించి యాత్రికులు దర్శించు తోమాలసేవ, అర్చనయయి రెండవ ఘంట కాఁగా ధర్మదర్శన మవును. అనంతరము శుద్ధిరాత్రి తోమాలసేవ అర్చన ఘంట అయితీర్మానము మామూలు ప్రకారమవును.

N. B. విశేష వుత్సవాదులున్నంతట విశ్వరూపదర్శనము నకు గాని, రాత్రి ధర్మదర్శనమునకుగాని కొన్నివేళల నవకాశ ముండదు.

# అ ధ్యా య ము IV.

## ప్రసాదములు.

ఇది దేవస్థానపు స్వంతము, ధర్మము, ఆర్జితమని మూఁడువిధములు. ప్రతిరోజు మొదటిఘంట రెండవఘంటలకు ఈ మూఁడు విధంబుల నివేదన లుండవచ్చును గాని రాత్రిమాత్రము దేవస్థానపు స్వంతములో ఖర్చుపడిన నివేదనమాత్ర ముండును. మొదటిఘంటకు నివేదనయిన త్రివిధప్రసాదములలో దేవస్థానపు స్వంతమనునవి కయింకర్యపరులు మొదలగువారికి హోదాకు తగినట్లు మర్యాదలు చేయుటకును దేశాంతరబ్రాంహ్మణాది వినియోగమునకును ఖర్చుపడును. ధర్మము అనఁగా ప్రతిదినము గాని కొన్నిరోజులలోఁగాని కొందఱు సామానులు ఇచ్చి ప్రసాదములు చేయించి ఆరగింపు చేయించెదరు. ఇది దేశాంతరులకు వినియోగము చేయవలసినది. హైదరాబాదు వరవర నరశింహరావుగారు, బెంగుళూరు శామన్న అనే శ్రీనివాసాచార్లుగారు, మైసూరు మహారాజుగారు, పుదుకోట రాజుగారు, సర్ తామస్ మన్రోదొరగారు మొదలగువార్ల ధర్మములు గలవు. సర్ తామస్ మన్రోగారిధర్మము శ్రీవేంకటేశ్వరస్వామివారి ప్రతాపమును దెలియఁజేయక మానదు గదా! ఆర్జితమనఁగా యాత్రికులు సొమ్ము దేవస్థానము పారుపత్యదార్ కచ్చేరిలోచెల్లించి రసీదు తీసుకొని నివేదనచేయించిన ప్రసాదములు. ఇవి ఆరగింపు అయిన తరువాఁత స్థలాచారప్రకారము కొంచెము ప్రసాదమెత్తుకొని తక్కినది యాత్రికులకు నియ్యఁబడును.

మధ్యాహ్నము రెండవఘంట నివేదనకు దేవస్థానపు స్వంతప్రసాదములున్నవి. మొదటిఘంటకు నివేదనకాని ఆర్జిత పదార్థము లున్నంతట ఇప్పు డారగింపవును. రెండవఘంట నివేదనయిన ఒకగంగాళం చక్కెర పొంగలి దేశాంతర బ్రాహ్మణ వినియోగము చేయఁబడును.

రాత్రిఘంటకు నివేదన దేవస్థానపు స్వంతప్రసాదము యినందునఁ గొంత మర్యాదలక్రిందను, కొంత దేశాంతర వినియోగమునకును ఖర్చు పెట్టఁబడును. రాత్రి ఇది తప్ప దేశాంతర బ్రాహ్మణులకుఁ బెట్టు అన్నసత్రములు లేవు. రాత్రి తీర్థానమయిన వెంటనే యొక చిన్నగంగాళము చక్కెరపొంగలి దేశాంతరులకు వినియోగము చేయింపఁబడును.

గురువారము పూలంగి యయినతరువాత వడపప్పు, పానకమును శుక్రవారము రెండవఘంటకు పోళీలు, వడపప్పు, పానకమును కూడ ఆరగింపవును.

ఆర్జితధర్మముల పణ్యారములు [illegible] వలె త్రికాలనివేదనలలో ఎప్పుడైనను [illegible]త్రికులు

పరఖామణి.

యాత్రికులు ముడుపులు దేవస్థానము పారుపత్యదార్ కచ్చేరిలో చెల్లించెదరు. లేదా డబ్బి, జోలి, గోలక్, కొప్పెర అని వేర్వేరు నామములచే వ్యవహరింపఁబడు హుండి పారుపత్యదార్ కచ్చేరికి ఎదురుగ నుత్తర భాగమున పహారాబందోబస్తుతోనుండు రాగిగంగాళము పొరలుగల దళముగుడ్డ బుర్ఖాలోనుంచబడి గొల్సులతో నిలువెత్తునఁగట్టబడి నాలు



55. శ్రీవారి కొప్పెర, ప ఖండి.

గుజీళ్లుగల దానిలో వేయవలయును. కచ్చేరిలోఁ జెల్లించిన దానికి రసీదు ఇచ్చెదరు. కొప్పెరలో వేసినదానికి రసీదులేదు. గాని రెండువిధములుగ జెల్లించినసొమ్ము దేవునకు చేరును. ఇది గాక యాత్రికులొకవేళ సన్నిధిలోనికి దర్శనమునకు వెళ్లినపుడు, ఏమైనను పైకము వేయుదురను నుద్దేశముతో కులశేఖరపడి అను కడపవద్ద ఒకచిన్న పెట్టె బీగములు శీళ్లుపైని రూపాయి పట్టుటకు రంధ్రముగా గలిగి పహారాబందోబస్తుతో ఉంచబడి యుండును. యాత్రికులు ఏమయిన వేసినంతట ఆడబ్బిలో వేయ వలయును గాని ఇతరత్ర ఇయ్యఁగూడదు. ఇట్లు హుండీలోను, చిన్నపెట్టెలోను వేయబడిన ముడుపులు పారుపత్యదార్ బావాజి, అసిస్టాంటు ట్రెజరరు, జియ్యంగారు, గుమస్తా ఎదుర నుండి హుండీని విప్పించి నాణ్యంవారిగ వరాబులు వగైరా లచేఁ బారుపత్యదార్ ఏర్పాటు చేయించును. ఈనాణ్యములు ఏర్పరచి లెఖ్ఖ వ్రాయుటకే పరఖామణి యనిపేరు. ఇదివరలో దర్శనము అను హెడ్డింగులో సందర్భానుసారముగఁ జెప్పిన ప్రకారము ఈపరఖామణి ప్రతిదినముసాధారణముగా మధ్యాహ్నము 1 ఘంటపై నుండి సాయంకాలము వరకు జరుగును. ఇది మఱుదిన ముదయమువరకు పారుపత్యదార్ కచ్చేరిలో నియ్యఁబడిన హారతి, అర్చన, వాహనము మొదలగు టిక్కెట్లకు సొమ్ముమూల్లెల (Bundles.) తోకూడ భద్రముచేయబడి తిరుపతిలోనుండు దేవస్థానపు ట్రెజరీకి రవానా చేయఁబడి బంగారు వగైరాలు దేవస్థానపు విచారణకర్తలవారివలన యాలములో విక్రయింపఁబడును.

## పక్షదిట్టము.

ప్రతి ఏకాదశికి మూలవరులకుఁ గాక ఇతర మూర్తులకు తిరుమంజనముజరుగును. ద్వాదసులందును బహుళఏకాదసులందును విశేషనివేదనైన దధ్యోదనము జరుగును.

## శ్రవణ నక్షత్రదిట్టము.

శ్రీవారి జన్మనక్షత్రమైన శ్రవణనక్షత్రము రోజున శ్రీఉత్సవరులకు తాయారులసయితము తిరుమంజనమయి శ్రీవారి రెండవఘుంట అయినవెంటనే విశేషవస్త్రాభరణంబుల నలంకారంబులు గావించి బంగారు తిరిచితో నుత్సవము శోభాయమానముగ నాలుగువీధుల జరిపించి దేవస్థానములో బంగారువాకిలి కెదురుగ రంగమంటపములో వేంచేయింపు చేసిన పిదప చక్కెరపొంగల్, శుండల్, (శనగలు) దోశలు, ఆరగింపయి గోష్టి వినియోగమవును. అనంతరము విశేషాలంకారము తీసి శ్రీవారు సన్నిధిలోనికి విజయము చేసిన తరువాత తోమాలసేవ, అర్చనఘుంట మొదలగునవి మామూలు ప్రకారము జరుగును.

## రోహిణి

శ్రీకృష్ణస్వామివారి జన్మనక్షత్రమయిన రోహిణీ నక్షత్రమందు రెండవఘుంట యయిన పిదప శ్రీరుక్మిణీసమేత శ్రీకృష్ణస్వామివారికి నాలుగువీధు లుత్సవమవును.అనంతరము శ్రీవారికి రంగమంటపములో పొంగలి, శనగపప్పు ఆరగింపయి ఆస్థానములో వినియోగమవును. తరువాత శ్రీవార్లు సన్నిధిలోనికి

విజయంచేసిన తరువాత రాత్రి తోమాలసేవ మొదలగునవి జరుగును.

## ఆర్ద్ర.

శ్రీ భాష్యకారులవారి తిరునక్షత్రమయిన ఆర్ద్రానక్షత్రమున రెండవఘంట అయిన తరువాత శ్రీవేంకటేశ్వరస్వామివారు, అమ్మవార్ల సహా వెండితిర్చిలో విజయముచేసి శ్రీభాష్యకార్లను అభిముఖముగ నొకతిర్చిలో నుండి నాలుగువీధుల ఉత్సవమయి దేవస్థానములో శ్రీభాష్యకార్లగుడికి ముందుమంటపములో శ్రీవార్లు విజయముచేసిన పదంపడి పొంగలి, కుండలు. (శనగపప్పు) ఆరగింపవును. ఆస్థానములో గోష్ఠి వినియోగమయినపిదప శ్రీవారు తాయార్లసయితము సన్నిధిలోనికి విజయముచేయంగ రాత్రి తోమాలసేవ మొదలగునవి జరుగును.

## ధర్మము.

### పునర్వసు నక్షత్రము.

శ్రీరాములవారి జన్మనక్షత్రమైన ప్రతి పునర్వసు నక్షత్రమందు శీతాలక్ష్మణ హనుమత్సహిత శ్రీరాములవారికి నుత్సవము జరుగును. ఇది శ్రీహత్తీరాంజిమఠం అధికారి శ్రీరామలఖన్ దాస్‌జిగారు దేవస్థానములో సొమ్ము కట్టినందున శాశ్వతముగ నుత్సవము జరుగును. శ్రీరాములవారు పడమటవీధిలోని ధర్మకర్తగారు కట్టించిన మంటపములోనికి విజయము చేసి దోశ ఆరగింపు వినియోగాదులయిన తరువాత మహాప్ర

దక్షిణముగ గుడిలోనికి విజయంచేయఁగ రాత్రి తోమాలసేవ మొదలగునవి జరుగును. శ్రీరాములవారు ఈ ఉత్సవములో విశేషవస్త్రాభరణాలంకారభూషితులుగ నుందురు.

## చిత్తానక్షత్రము.

ఇది శ్రీమైసూరు మహారాజుగారి జన్మనక్షత్రము. ప్రతి నెలకు చిత్తానక్షత్రమందు శ్రీవారికి మైసూరు మహారాజుగారిచే సమర్పింపఁబడిన దంతపు పనిచేసిన పాలకియం దుత్సవము జరిగి శ్రీవారి రంగమంటపములో పులిహోర ఆరగింపయి ఆస్థానమందు వినియోగము జరుగును. ఇది యుభయనాంచార్ల సమేతమైన ఉత్సవము. అనంతరము రాత్రి తోమాలసేవ మొదలగునవి మామూలు ప్రకారము జరుగును.

## ద్వాదశిఉత్సవము.

శ్రీమలయప్పస్వామివారు (శ్రీవెంకటేశ వుత్సవరులు) పగలు రెండవఘంట అయిన తరువాత కొయ్యతిరిచిలో మహాప్రదక్షిణముగ నుత్తరపు వీధిలోనున్న శ్రీగద్వాల్ రాజు గారి ద్వాదశీమంటపమునకు విజయముచేసి యచ్చట శ్రీరాజుగారి ఏజంటు. వేసిన పులిహోర, శనగపప్పు నివేదింపఁబడి ఆస్థానమందు వినియోగమవును. అనంతరము శ్రీవారు దేవస్థానములోనికి విజయముచేయ రాత్రి తోమాలసేవ మొదలగునవి పద్ధతిప్రకారముజరుగును. ఇది శ్రీగద్వాలరాజుగారి ధర్మము.

## వసంతోత్సవము.

ఇది ప్రతిసంవత్సరము చైత్ర శుద్ధ త్రయోదశి మొదలు పూర్ణిమవరకు మూఁడుదినములు జరుగును. మొదటి రెండు

రోజులు వుదయము 8 ఘంటలకు శ్రీవారికి రెండవ నివేదన అయి బంగారుతిరిచిలో పునర్వసు ఉత్సవమునకుం జెప్పినమంటపమునకు విజయముచేసి యచ్చట తిరుమంజనము, అలంకారము, నివేదన, ఆస్థానవినియోగములు, ఉత్సవముయినతరువాత శ్రీవారు కొంతరాత్రి అయినపిదప దేవస్థానములోనికి విజయముచేసి నిత్యోత్సవాస్థానములయి శ్రీవారి సన్నిధిలోనికి దయచేసి తోమాలసేవ మొదలగునవి జరిగి తీర్థానమవును. మూడవరోజుగూడ ఇదేరీతిగ జరుగును. సీతాలక్ష్మణహనుమత్సమేతముగ రాములవారుకూడా విజయముచేసెదరు. ఉత్సవము కన్నులపండుగగనుండును. ఈ మూడురోజులు రాత్రిపగలు రెండుపూటలు బ్రాహ్మణసమారాధన జరుగును. ఈయుత్సవము అధికారి శ్రీరాములఖన్ దాస్ జివారి ధర్మము.

## అధ్యాయము.

## విశేషఉత్సవములు, ఆస్థానములు.

వీనిలో నొక్కొక్క ఉత్సవము సంవత్సరమున కొక్కతూరి వచ్చుచున్నవి. ఇందులోముఖ్యమయిన వానినిం బేర్కొనెదను.

### 1 సంవత్సరాది ఆస్థానము.

ఇది ప్రతిసంవత్సరము ఆంధ్రసంవత్సరాది దినము జరుగును. ఈదివసమున రోజు 12 ఘంటలకయ్యోదునివేదన ఉదయము 5 ఘంటలకయి శ్రీమలయప్పస్వామివారు (ఉత్స

వరులు) శ్రీతాయారుల సయితము రంగమంటపములో జోడించి యున్న బంగారు మంటపమనెడి సర్వభూపాలవాహనమందు దయచేసి వజ్రకవచము, రఘోజిభాన్సలె మొదలగువారు సమర్పణచేసిన విశేషతిర్వాభరణములు (నగలు) సమర్పణ చేయబడిన తరువాత పుష్పాలంకారమయి, విశేషనైవేద్య ములతో రెండవఘంట అయిన పిదప శ్రీమూలవరులకును శ్రీఉ త్సవరులకును నూతనవస్త్రధారణమయి ఆస్థానవినియోగము నకు శ్రీవిచారణకర్తలవారు మొదలగు వారందఱుఁ గూర్చుం దురు. శ్రీవారికి నూతనపంచాంగము శ్రుతపరుపఁబడును. పంచాంగమును గుణించిన వారికి బహుమానము లొసంగఁ బడును. తఱువాత కొన్ని స్థలాచార పద్ధతులు జరిగి లడ్డు, వడ, అప్పము, దోశ మొదలగు ప్రసా దములు దేవస్థానమర్యాదల ప్రకారము కైంకర్యపరులకు బహుమానమయి వినియోగమవును. ఆస్థానము 11 A. M. ఘంటలకు పూర్తిఅవును. ఆస్థానములో బ్రాహ్మణేతరులు కూ ర్చుండఁగూడదు. అనంతరము ధర్మదర్శనమవును.

## 2 నిత్యోత్సవము.

ఇది సంవత్సరాది మొదలు 40 రోజులు జరుగును. ప్రతి సాయంకాలము శ్రీవారికి మాత్రము వెండితిరిచిలో వేద్వేరు వాద్యములతో వేదప్రబంధపారాయణములతో ఊరుచుట్టు ఉత్స వము జరుగును. సంవత్సరాదిరోజున మాత్రము ఆస్థానాలం కారముతో తాయారుల సయితము ఉత్సవమవును. 40 రోజు లును ఉత్సవానంతరము శ్రీభాష్యకారులవారి ముఖమంటప

ములో బకాళాభాత్ (పెరుగుఅన్నము) శనగపప్పు సహా ఆస్థానమవును.

3 ఆనివరాస్థానము.

ఇది ప్రతిసంవత్సరము ఆనినెల ఆఖరు ఆడినెల మొదటి తేదీని జరుగును. ఈ ఆస్థానములో కూర్చుండువరకు సంవత్సరాది ఆస్థానములోవలె జరిగి శ్రీవారిపాదముల వద్దనున్న బీగములు, మొహర్లు అర్చకులు జియ్యం గార్లకు విచారణ కర్తల వారికి వప్పగించిన తరువాత ప్రసాదపణ్యారములు సంవత్సరాది ఆస్థానములోవలెనే వినియోగమయి ఆస్థానము సమాప్తమగును. ఈఆస్థానము దక్షిణాయనపుణ్యకాలమురోజునజరుగును. ఆస్థానాంతరము ధర్మదర్శనమవును.

4 దీపావళిఆస్థానము.

ఇది దీపావళిరోజున జరుగును. దీనియందు పంచాంగ శ్రవణముగాని బీగముల మోహరుల వప్పగింతగాని ఉండదు. శేషము సంవత్సరాది ఆస్థానములోవలె జరుగును. ఆస్థానమునకు ముందు బ్రహ్మోత్సవపు అంకురార్పణ దివసమున దయచేసిన మూర్తులు కళ్యాణమంటపము యాగశాలలనుండి శ్రీవారి గర్భాలయములోనికి విజయము చేసెదరు.

1, 3, 4 అయిటమ్‌ల ఆస్థానములు పెద్ద ఆస్థానములని పేరు. శ్రీరామనవమి, గోకులాష్టమి, కౌశిక ద్వాదశి ఆస్థానములు చిన్న ఆస్థానములనఁబడును.

5 శ్రీవారి తెప్పోత్సవము

ఇది దుర్మతిసంవత్సర ఫాల్గుణ శుద్ధమందు జరిగినది. ఈ ఉత్సవము నూతనము దేవస్థానపు విచారణకర్తలైన

శ్రీమహంతు ప్రయాగ దాస్ జీవారివలన ఏర్పాటు చేయబడినది. చూచుటకు కన్నులపండగగ నుండును

## 6 శ్రీవారిబ్రహ్మోత్సవము.

ఇది ప్రతిసంవత్సరము అనగా అధికమాసమువచ్చినప్పుడు తప్ప నవరాత్రులలో జరుగును. ఉత్సవ ప్రారంభమునకుపూర్వదినమందు శ్రీవారిబ్రహ్మోత్సవ అంకురార్పణముజరుగును. ఈరాత్రి శ్రీవారిగర్భాలయములో శ్రీమూలవరులు భోగఉగ్రమూర్తులుతప్పఇతరమూర్తులను శ్రీవారికళ్యాణమంటపములోనికిని,యాగశాలలోనికిని విజయముచేయించిసేనావళీఆస్థానమువరకుంచుదురు. ఈదినము రాత్రి నివేదనపెద్దఘంటకు ముందు శ్రీసేనాధిపతి వారికి నాలుగు వీధులుత్సవముజరిగితిరుమలరాయమంటపములో ఆస్థానము జరిగి రాత్రి ఘంటయి తీర్మానమవును. శ్రీవారిబ్రహ్మోత్సవమునకు అన్నిపనులు సిద్ధముగాఅయినవా? అనుట కొఱకును మృత్సంగ్రహణముకొఱకును ఈఉత్సవముజరుగునని భావము. శ్రీవారిబ్రహ్మోత్సవము మంత్రయుక్తముగా హోమములతో జరుగును.

మొదటిరోజున—

1 ధ్వకారోహణోత్సవము.
2 పెద్దశేషవాహనము.

ఈదినమున విశ్వరూపదర్శనము, తోమాలశేవ, అర్చనఘంట అయి శాత్తుమొరకుముందుగనే శ్రీవారిని ఉభయదేవుల సమేతముగ బంగారు తిరిచిలో విశేష సర్వాభరణాలంకారము చేసినతరువాత మంత్రయుక్తముగ కొన్నిక్రియలు



63. శ్రీహరి ధ్వజస్తంభము.



63. శ్రీవారి తిరుమలరాయమంటపము.

జరిగినపిదప ఆర్జిత బ్రహ్మోత్సవ గృహస్థులు శ్రీ విచారణ కర్తలవారును, ఉద్యోగస్థులలో పేష్కార్, పారుపత్యదార్ మొదలగువారు యుండి సంకల్పయుక్తముగ దత్తముచేయించి శ్రీమూలవరుల సనుమతిలో అవర సన్నిధికి వెళ్లి అచ్చట నుండి మంత్రములతో అర్చకులు బలినాయించుచు ఉత్సవమూర్తికి ముందుగ వెళ్లెదరు. ఇట్లు నాలుగువీధులు ఉత్సవమైనతరువాత ధ్వజపటమునకు ధ్వజస్తంభమువద్ద పూజజరిగినివేదనై స్తంభము పై నెక్కించెదరు. తిరుమలరాయమంటపములో ఆస్థానమై శ్రీవారు లోపలకు దయచేసిన తరువాత రెండవఘంటయైన వెంటనె తోమాలసేవ, అర్చన రాత్రిఘంట అయి శ్రీవారికి పెద్దశేషవాహనోత్సవమగును.ఉత్సవమై ఆస్థానానంతరము శ్రీవారు లోపలకు దయచేసినతరువాత తీర్థానమై తలుపులు వేయబడును.

రెండవదివసము.—

1 మధ్యాహ్నము మొదటిఘంట అయిన తరువాత చిన్న శేషవాహనము.

2 రాత్రి నివేదనఘంటఅయినతరువాత హంసవాహనము.

నిన్న మొదలు 9 దివసములు దినమును ఒక్కధర్మదర్శనము మాత్రముండును.

మూడవదివసము.—

1 పగలు సింహవాహనము.

2 రాత్రి ముత్యపుపందిలి అనె వాహనము. (తాయారులు సయితము).

నాల్గవదినము.—

1 పగలు కల్పవృక్షవాహనము.
2 రాత్రి సర్వభూపాలవాహనము (రెండును తాయార్లు సయితము)

అయిదవదివసము.—

1 పగలు మోహినీ అవతారము పాలకీ ఉత్సవము.
2 రాత్రి గరుడవాహనము.

ఆఱవదివసము.—

1 పగలు హనుమంతవాహనము (మొదటిఘంట యయిన పిదప) వసంతోత్సవము. (రెండవఘంటయయినపిదప)
2 రాత్రి ఏనుగువాహనము.

ఏడవదివసము.—

1 పగలు సూర్యప్రభవాహనము.
2 రాత్రి చంద్రప్రభవాహనము.

ఎనిమిదవ దివసము.—

ఈ దివసమున తెల్లవారుసరికి మొదటిఘంట అయిన పిమ్మట శుభముహూర్తమున శ్రీవారు అమ్మవారుల సయితం రథారూఢు లగుదురు. సాయంకాలమునకు రథము నాలుగు వీధులు తిరిగి యథాస్థానమునకు వచ్చినతఱువాత శ్రీ వారు సన్నిధికి వెళ్లఁగా రెండవఘంట అవును. వెంటనే రాత్రి ఘంట అయి గుఱ్ఱపువాహనము జరుగును. శ్రీవారి బ్రహ్మో త్సవములో గురువారము రాత్రిన్ని, శుక్రవారము విశ్వ

రూపపాన్నానము, అభిషేకము నితరకాలములలోని గురుశుక్ర వారముల వలన ధర్మదర్శనము లేక మనిషికి రు 1 వంతున ఇచ్చి పారుపత్యదారు ఖచేరిలో చీటి తీసుకొని లోపలకు వెళ్లవలెను.

తొమ్మిదవ దివసము.—

1 పాలకీఉత్సవము.

2 మూర్ధాభిషేకమనే తిర్చి ఉత్సవము.

ఈ రెండున్ను శ్రీవారి మొదటఘంట అయినతరువాత ఉదయము 7 ఘంటలలోపల పూర్తియవును. రెండవఉత్సవానంతరము శ్రీవరాహస్వామివారి సన్నిధిలో ఉభయ అమ్మవారుల సమేతం శ్రీవారికిన్నీ, చక్రత్తాళ్వారికిన్నీ తిరుమంజనము జరిగి చక్రత్తాళ్వారికి మాత్రంపుష్కరిణిలో స్నానమయినతరువాత శ్రీవారు లోపలికి విజయంచేయగా శాత్తుమొర అయి ధర్మదర్శనమగును.

రాత్రి బంగారుతిర్చి ఉత్సవమయి ధ్వజావరోహణము జరుగును. బ్రహ్మోత్సవకాలములో శ్రీవిచారణకర్తలవారు తిరుమలమీఁదనే ఖచేరిచేసెదరు.

## 6 నవరాత్రోత్సవము.

చాంద్రమానరీత్యా అధికమాసము వచ్చినపుడు శ్రీవారి బ్రహ్మోత్సవము భాద్రపదమాసములో జరుగును. నవరాత్రుల లో ప్రత్యేకముగ నవరాత్రోత్సవము జరుగును. ధ్వజారోహణావరోహణములును తేరుమాత్రము జరుగకనంతయు బ్రహ్మోత్సవమువలె నుండును. ఈ యుత్సవకాలములో శ్రీవిచారణకర్తల

వారు కొంతమంది ఉద్యోగస్థులతో నిచ్చటనె ఖచేరిచేసి దరు. నవరాత్రోత్సవములో తిరుమలరాయ మంటపములో గాక రంగనాయక మంటపములో నాస్థానము ప్రతిసారియు జరుగును.

## 7. ధనుర్మాసము.

ధనుర్మకరసంక్రమణముల మధ్యకాలమునకు ధనుర్మాసమనిపేరు. ఈనెలదివసములు సుప్రభాతశ్లోకములు చెప్పరు. ద్రవిడప్రబంధము పఠించుచు బంగారువాకిలి తీయుదురు. వెంటనె తోమాలసేవ, బిల్వార్చనయి నివేదనఘంట అవును. అనంతరము శుక్రవారముదయమునఁ దప్ప ధర్మదర్శనమయి నివేదనయిన ప్రసాదములు అనఁగా శనగపప్పు, బెల్లపు నేతి దోశలు, పొంగలి, చక్కెరపొంగలి, పండ్లు మొదలగునవి శ్రీభాష్యకారులవారి ముఖ మంటపములో స్థానబహుమాన పూర్వముగా గోష్టి వినియోగమవును. ఈతోమాలశేవ, అర్చన బహిరంగముగాదు.

ధనుర్మాసపూజలో తోమాలసేవ, అర్చన ఏహాస్యము గాన నెవరు పోఁగూడదు. బ్రాహ్మణేతరులకు వాపతుమైనను లేదు. ధనుర్మాసపుఘంట దర్శనమయిన తరువాత తలుపులు వేయబడి 9 A. M. ఘంటలకు తిరుగ తెరచి ధర్మదర్శనము లేక నేతోమాలసేవ మొదలగునవి మామూలు ప్రకారము జరుగును. ఈమాసమున రాత్రి శయనమునకు శ్రీకృష్ణస్వామి వారు దయచేసెదరు.

శ్రీవారి ధనుర్మాసములోని శుద్ధఏకాదశికి "ముక్కోటి ఏకాదశి" అనిపేరు. ఈదివసమున శ్రీవారి వైకుంఠప్రాకారము



67. రంగనాయకమంటపములోని ఆస్థానమంటపము.

ఈ చిన్నమంటపము రంగనాయకమంటపములోనున్నది. ఈ చిన్నమంటపములోనున్న పెద్ద శేషవాహనములోకి శ్రీవారు ఆస్థానములో విజయము చేసెదరు.

తెఱచెదరు. ఈప్రకారము సంవత్సరమున కొకదినము మాత్రము తెరవఁబడును. ఈసాయంకాలమున సర్వభూపాలవాహనములో శ్రీవార్లకు వజ్రకవచము మొదలగు విశేషాభరణములు సమర్పణచేసి ఉత్సవముజరుగును. ఈరాత్రి [illegible] శీఘ్రకాలములోన తలుపులు తెరచి ధనుర్మాసపుపూజనిర్వర్తించి నయు నిత్యకట్ల త్రోమాలసేవ, అర్చన ఘంటలయి చక్రత్తాళ్వారు మహాప్రదక్షిణముగ శ్రీస్వామిపుష్కరిణిలో తెల్లవారు సమయమున స్నానమొనరించెదరు. ఈసమయమే పుణ్యకాలమని చెప్పెదరు. అప్పుడందఱును స్నానముచేసెదరు. శ్రీస్వామి పుష్కరిణిచూచుట కాహ్లాదకరముగ నాలుగు ప్రక్కలుస్నానముఁజేయు జనులతో నిండియుండును. ఈసమయమందు శ్రీస్వామి పుష్కరిణిలో 360 తీర్థములు కలియుననియు,సమస్త దేవతలును ఆసమయమున వచ్చి స్నానమాచరించెద రనియు చెప్పెదరు. ద్వాదశీనాడు సాయంకాలము వైకుంఠద్వారము తలుపులు వేయుదురు.

## 9 అధ్యయనోత్సవము.

ఇది 25 దివసములు జరుగును. ఈదివసములలో శ్రీఉత్సవరులు బ్రహ్మోత్సవములోవలె కళ్యాణమంటపములో నుందురు. ప్రతిదివసము తిరుమ్మానమునకు ముందు అచ్చటాస్థానము జరుగును. ఈదివసములలో వేదాధ్యయనమును, ద్రావిడ వేదమగు ప్రబంధ పఠనము నుండును. దేవస్థానములో నేదైన వైదికలోపము తెలియక జరిగినయెడల దానిని హరించుటకు నీ యుత్సవ మేర్పడినదని కొందఱి మతము. మఱికొందఱు దానిని తిరువధ్యయనోత్సవమనెదరు.

## 10 రథసప్తమి.

ఇది మాఘశుద్ధ 7-వ దివసమునకుఁ బేరు. ఈదినమునఁ దెల్లవారుసరికి మొదటిఘంటఅయి శ్రీవారుసూర్య ప్రభవాహనము మీఁద వజ్రకవచము మొదలగునవి సమర్పణఅయి సూర్యోదయమునకు ఉత్తరపువీథిలో వాహనముండవలెను. సూర్యప్రభవాహనముమీఁద విశేషాభరణభూషితులై సూర్యకిరణములు శోకగా దేదీప్యమానులైయుండు శ్రీవారు పాదాక్రాంతుఁడగు సూర్యున కభయమిచ్చుకీతి శోభిల్లుచుందురు. తఱువాత చిన్నశేష, గరుడ, హనుమంత వాహనములు జరిగి చక్రస్నానమయి రెండవఘంట అయిన పిదప శ్రీవారి ధర్మ దర్శన మగుచుండఁగ సర్వభూపాలము, కల్పవృక్షము, చంద్రప్రభవాహనములు జరిగి శ్రీవార్లు సన్నిధికి విజయంచేసిన తఱువాత రాత్రి ఘంటయి గుంపులేకనే (గురువారం తప్ప) తీర్థానమయి తలుపులు వేయఁబడును, రథసప్తమికి అర్ధబ్రహ్మోత్సవమని పేరుగలదు.

## అధ్యాయము VI.

### ఆర్జితము.

శ్రీవారికి యాత్రికులు సొమ్ము తిరుపతి శ్రీవిచారణకర్తలవారి ఆఫీసులోఁగాని తిరుమల దేవస్థానము పారుపత్యదార్ ఖచేరిలోఁగాని చెల్లించి శ్రీవారికి ఉత్సవములు, నివేదనలు, శేవలు చేయించవచ్చును. ఇట్లు చెల్లించుసొమ్మునకు రసీదులు ఇయ్యఁబడును.

## (a) ఉత్సవములు.

శ్రీవారికి రెండవఘంట అయిన తరువాత యాత్రికుల యొక్క ఆర్జితోత్సవములు జరుగును.

ఉత్సవములకు చెల్లించు సొమ్మువివరము.

| | | |
|---|---|---|
| 1-వ | తరగతి బ్రహ్మోత్సవము | 1205 |
| 2-వ | ,, | 925 |
| 3-వ | ,, | 805 |
| 4-వ | ,, | 705 |
| 5-వ | ,, | 625 |
| 6 | వసంతోత్సవము | 1005 |
| 7 | వజ్రకవచము లేనివాహనము | 41 |
| 8 | వజ్రకవచము సహావాహనము | 61 |
| 9 | కళ్యాణోత్సవము | 305 |
| 10 | ఇతరవాహనము | 21 |

(అనగా గరుడవాహనము మొదలగునవి)

బ్రహ్మోత్సవము.

ఇందుకు 8 దివసములలో 16 వాహనములు జరుగును. గాని దేవస్థానము సౌకర్యమును, ఇతయాత్రికులకు ఇబ్బంది లేమియు యోచించబడును. బ్రహ్మోత్సవము దత్తమైనది మొదలు బ్రహ్మోత్సవగృహస్థుల తాలూకు మనుజులను బ్రహ్మోత్సవము తరగతివారిని బట్టితో మాలసేవ, అర్చన, ఏకాంత సేవకు వదలెదరు. మొదట శ్రీవారికి రెండవఘంట అయినతరువాత వెండితిరిచిలో శ్రీవారికి వజ్రకవచము సమర్పణాయి బ్రహ్మోత్సవము దత్తమవును. వాహనములు ఆఖరున తేరుకు ప్రత్యే

మ్నాయముగ సర్వభూపాల వాహనమునకు అరటిచెట్లు మామి డియాకు తోరణములు గట్టి జరిపించెదరు. దీనితో బ్రహ్మోత్స వము పూర్తి అయినట్టు ఎంచవలెను. బ్రహ్మోత్సవము దత్త మునకు ముందును, తేరునకుఁ దరువాతను గృహస్థులను పైనఁ జెప్పినసేవకు వదలరు. ఈలోపుకాలములో విశేషదర్శనములు, మధ్యాహ్నము పొంగిలి ప్రసాదముగల చిన్నగంగాళము, రాత్రి దోసెలు ఇయ్యఁబడును. దత్తసమయమందు ఒకరూపాయియు, వాహనము జరిగినపు డొక్కొక్కహారతికి ఒక్కొక్కరూపా యియునియ్యవలెను. ఇవి దేవస్థానమునకు చేరును. బ్రహ్మోత్స వాంత్యమున వస్త్రమును తీర్థప్రసాదములను గృహస్థునకు బహుమతిచేసి వాద్యములతో వారి బసకుఁ బంపెదరు.

## వసంతోత్సవము

ఇది పదిరోజులు జరుగును. రెండవఘంట అయిన తరు వాత శ్రీవారికి ఉభయఅమ్మవార్లు సయితము ధ్వజస్థంభమునకు దక్షిణముగనుండు తిరుమలరాయమంటపములో తిరుమంజ నము, అలంకారము అయి వడపప్పు పానకము నివేదనచేయ బడును. సంపంగి ప్రదక్షిణముగ శ్రీవారు ఉగ్రాణము ముందు మంటపమునకు దయచేసి అచ్చట ప్రసాదములు నివేదనయి శ్రీవార్లకు కుంకుమపువ్వుకలిపిన చందనము సమర్పణయి శేష చందనమును, తాంబూలము సహా వినియోగమవును. అనంత రము నాలుగు వీధులు ఉత్సవము జరుగును. ఇట్లు పది దివస ములు జరిగిన తరువాత బ్రహ్మోత్సవములోవలెనె గృహస్థుకు బహుమానము జరుగును.



71. కల్యాణమంటపము.

## కళ్యాణోత్సవము.

ఈ యుత్సవ మొక్క ఝామము జరుగును. శ్రీవారికి రెండవఘంటయయినతరువాత ఉత్సవర్లను శ్రీతాయారులు సహితము కళ్యాణ మంటపమునకు విజయంచేసి అచ్చట గృహస్థుచే సంకల్పము చేయించి మంత్రహోమయుక్తముగా వాద్యములతో కళ్యాణము శ్రీవార్లకు జరిపించి లడ్డు, వడ, దోశ, అప్పము నాలుగు గంగాళముల ప్రసాదములు ఆరగింపయి నాలుగువీధు లుత్సవమవును. ఆరగింపయిన ప్రసాదములలో 30 లడ్లు, 30 వడలు, 30 అప్పములు, 60 దోశలు, 3 గంగాళముల ప్రసాదములు గృహస్థులకు ఇయ్యబడును. ఉత్సవమునకు అర్చకులు మొదలగు కైంకర్యపరులకు వస్త్రబహుమానము లియ్యబడును. కైంకర్యపరులకును దక్షిణకూడా నియ్యబడును. గృహస్థుఖచేరిలో చెల్లించిన రూపాయిలు తప్ప దత్తమున కొంకరూపాయియు, హారతిరూపాయియుగాక ఇతరఖర్చు లేమియు చేయ నవసరములేదు.

## ఇతరవాహనములు.

తక్కిన ఉత్సవములు అనగా వాహనములు శ్రీవారికి రెండవఘంట అయిన తరువాత జరుగును. హారతికి మాత్రము వేరే రూపాయి ఖచేరిలో చెల్లించి రసీదు తీసుకొనవలెను. ఎందరు ఒకేతరహావాహనమునకు సొమ్ముచెల్లించినను అందరకు ఒకసారి వాహనము నాలుగువీధుల ఉత్సవము జరుగును. గాని వేర్వేరుగా జరుగదు. వర్షము మొదలగు కారణములవలన వీధి ఉత్సవము జరుగలేనంతట గుడిలోపలనే వాహనము వేసి శ్రీవారిని విజయంచేయించి గృహస్థు తెచ్చిన హారతిఅయి

తాను మూడుసారులు ప్రదక్షిణముచేసి నమస్కారము చేసి నంతట ఉత్సవము పూర్తి అవును.

ఉత్సవములు మొదలగువానికి సొమ్ముచెల్లించి రసీదు తీసుకొనువారు ఆరసీదు ఆకాలమందు దేవస్థానం అధికారస్తులకు చూపించినగాని ఉత్సవాదులు జరుగనేరవు. గనుక భద్రముగా నుంచుకొనవలెను.

## (b) సేవలు.

శ్రీవారికి సేవలుచేయించువారు ఈదిగువ వివరప్రకారము సొమ్ము చెల్లింపవలెను.

| | |
|---|---|
| తోమాలసేవ | 13 |
| అర్చన | 7 |
| ఏకాంతసేవ | 13 |
| ఆమంత్రణోత్సవము | 100 |
| పూలంగిసేవ | 60 |
| పూలంగిదర్శనము | 1 |
| పూరాపుళికాపుసేవ | 450 |
| పుళికాపుదర్శనం | 1 |
| గంబూరాగిన్నె | 250 |
| పునుగుచట్టంగిన్నె | 85 |
| కస్తూరిగిన్నె | 50 |
| జాఫరాగిన్నె | 65 |
| సహస్రకలశాభిషేకం | 1005 |
| పూరాతిరుప్పావడ | 1005 |

| | |
|---|---|
| అరతిరుప్పావడ | 505 |
| కోవిలాళ్వార్ తిరుమంజనం | 505 |
| ఐనామహాల్ సేవ | 61 |

ఇదివరలో తోమాలసేవ, అర్చన, ఏకాంత సేవలను గురించి చెప్పఁబడినవిగదా. ఐనామహాల్ శేవ ప్రస్తుతం లేదు.

### ఆమంత్రణోత్సవము.

"ఒక దినమున శ్రీవారిపూజ, నివేదన చేయించినట్లు" భావముతో ఈసేవ చేయఁబడును. ఆమంత్రణోత్సవము 1-కి పదిమంది జనమువంతున తోమాలసేవ, అర్చన, ఏకాంతసేవ. లకు వదలుటయేగాక మధ్యాహ్నము చిన్నగంగాళము పొంగలియు, రాత్రి 30 దోశలును నియ్య బడును. తోమాలసేవ కాలములోదత్తమునకు రూపాయి గృహస్థు ఇయ్యవలయును. ఇదిగాక హారతులకు వేఱేహారతి చీట్లు ఖచేరిలో సొమ్ము చెల్లించి పుచ్చుకొనవలయును. ఇది చేయించిన వారికొక మనోహారము బహుమానమియ్యఁ బడును.

### పూలంగిసేవ.

గురువారము సాయంకాలము పూలంగి దర్శనమునకు మనిషికొక రూపాయి వంతున నియ్యవలె నని ఇది వరలో చెప్పఁబడెను గదా! శ్రీవారికి విశేషాలంకారముగా నుండు ఒక నిలువుటంగీ తొడిగి పుష్పాలంకార భూషితులుగఁ జేయుటయే పూలంగిసేవ యనఁబడును. ఇది చేయించినవారికి పూలంగిదర్శనము టిక్కెట్ లేకనె కొందఱిని దర్శనమునకు వదలెదరు. తీర్థప్రసాదములు బహుమానముగా నిచ్చెదరు.

## పులికాపుసేవ.

పులికాపుసేవ యనఁగా నభిషేకపుసేవయని యర్థము. ఇది పూరాపులికాపు, గంబూరా, జాఫరా, కస్తూరి, పునుగు చట్టం గిన్నెలని అయిదు విధములు. పూరా పులికాపు అనఁగా గంబురా మొదలగు నాలుగున్ను కలసి యుండును. పూరాపులికాపునకుసొమ్ము చెల్లించినగృహస్థునకు అభిషేకమున కు వాద్యములతోఁ బరిమెళము గిన్నెలు తీసుకొని వెళ్లునప్పుడు గంబూరా అనఁగా పచ్చకర్పూరం, జాఫరా అనఁగా కుంకుమ పువ్వు, కస్తూరి, పునుగుతైలము వేర్వేరుఁగానుంచి ఒక వెండి గిన్నె గృహస్థుచేతి కియ్యఁబడును. గంబూరా మొదలగు నవి కట్టినవారికి ఆయావస్తువుమాత్రమె కలిగినగిన్నె ఇయ్యఁబడును.

శ్రీవారి అభిషేకమునకు పచ్చకర్పూరము, కుంకుమ పువ్వు, పునుగుచట్టం, కస్తూరి పరిమెళం అజలోనూరి శిద్ధము చేసి ఇదివరలో చెప్పినట్టుగా వాద్యములతో శ్రీవారిసన్నిధిలో నికి తీసుకొనివెళ్లఁబడును. పూరాపులికాపుమొదలగునవి కట్టిన గృహస్థులకు పులికాపుదర్శనము టిక్కెట్ అవసరములేకుం డగ కొంతమందిని లెఖాచారప్రకారము వదలెదరు. అనంత రము గృహస్థులకు తీర్థప్రసాదములు ఇయ్యఁబడును.

## పూరాతిరుప్పావడ.

కొన్నిబస్తాల బియ్యంవంటచేసి బంగారువాకిలిముందు రంగపటములో వేసి నివేదనయిన తర్వాత అచ్చట గృహస్థు వలన సంకల్పముతో దత్తముచేయించెదరు.

## అర తిరుప్పావడ.

పూరాతిరుప్పావడవలెనే జరుగును గాని కుంభమునకు మాత్రము సగము సామానులుపడును.

## కోవిలాళ్వార్ తిరుమంజనము.

తెల్లవారుసరికి మొదటిఘంటయి లోపల అఖండము లుంచు శమ్మలు మొ॥ బయటకుందీసి శుద్ధిచేసి గోడలు, పై కప్పు మొదలగువానికి కుంకుమ, కర్పూరము చందనము మొదలగునవి కలపి వ్రాయుదురు. తరువాత రెండవఘంట నాలుగు ఘంటలకయి గృహస్థుకు వస్త్రబహుమానమయి వాద్యము లతో వెళ్లినపిదప ధర్మదర్శన మారంభమగును.

## సహస్రకలశాభిషేకము.

శ్రీవారి మొదటిఘంట ఉదయము 8-ఘంటలకు అయిన తరువాత వెయ్యిన్ని యెనిమిది వెండిచెంబులతో మంత్రవత్ సహారమయుక్తముగా అభిషేకము జరుగును. శ్రీవారి రంగ మంటపములో శ్రీభోగశ్రీనివాసమూర్తివారు, శ్రీఉత్సవరులు శ్రీసేనాధిపతివారికి అభిషేకము జరుగును. శ్రీభోగ శ్రీనివాస మూర్తివారికి, శ్రీమూలవరులకుపట్టుసూత్రముచేత సంబంధము గలిగియుండును. శ్రీభోగశ్రీనివాసమూర్తి వారు ఈసహస్ర కలశాభిషేకమునకు మాత్రము బంగారువాకిలిదాటివచ్చెదరు.

## అధ్యాయము VII.

### 1. ఆర్జితనివేదన.

ఇది చెరుపులు, పళ్లు అని ద్వివిధంబులు.—

I. చెరుపులు.—

| | | |
|---|---|---|
| దధ్యోదనము. | 30 | రూపాయలు. |
| పులిహోర. | 35 | ,, |
| పొంగలి. | 40 | ,, |
| చక్కెర పొంగలి. | 45 | ,, |
| శాకరభాత్. | 65 | ,, |
| కేసరిభాత్. | 65 | ,, |
| పాయసం. | 45 | ,, |
| శీరా. | 85 | ,, |

ఈ మొత్తముం జెల్లించి రసీదు తీసుకొనవలెను. సాధారణముగా ఉదయము 8 లేక 9 ఘంటలలోగా చెల్లించక ఆలస్యమయినంతట ఆరోజున నివేదనకు తయారుకావు. దినుసుల వెలలబట్టి నివేదనలకు చెల్లించుసొమ్ము అప్పుడప్పుడు మారవచ్చును.

II. పళ్లు:—

| | |
|---|---|
| లడ్డు లేక జిలేబి 1-కి | రూ. 65 |
| వడ, మనోహరం, పోళి, దోశ, అప్పం, తేనె తొళ, శుఖి, అతిరసం 1-కి | రూ. 40 |

ఈ నివేదలకు ఇంతకుహెచ్చు ఏమియు చెల్లించనవసరము లేదు. నివేదన అయినతరువాత 30 పణ్యారములు ఇయ్యంబడును.

ఊరగాయ పచ్చడికి రు 5-0-0 లు ఇయ్యవలెను. కాయలు గృహస్థు ఇయ్యవలెను. ఒక గూనపచ్చడి ఆరగింపు చేయించి ఇచ్చెదరు.

పైన జెప్పిన ప్రసాదములను నివేదన చేయించుటకు శక్తిలేని యాత్రికులు కలకండ, కొబ్బెర, ముంతమామిడి పప్పు, బాదంపప్పు మొదలగునవి కొని ఆదినుసులఖరీదు మొత్తమునకు సరిగ దేవస్థానం పారుపత్యదార్ ఖచేరిలో చెల్లించి రసీదుతీసుకొని బంగారువాకిలి వద్దనున్న బ్రాహ్మణుని వశములో నిచ్చినంతట నివేదనచేయించి ప్రసాదమిచ్చును. ఎంత ఎక్కువవిలువ అయినను రు 0-4-0 తక్కువ నుంకము వసూలు చేయరు. శ్రీవారి అఖండములో నెయ్యివేయుటకున్ను, నగలు వస్త్రములు మొదలగునవి సమర్పణచేయుటకున్ను ఇదేపద్ధతి గమనించవలెను.

యాత్రికులు తమ బసలయందు శుభకార్యములు చేయునపుడు వాద్యము కావలసినంతట రు 1-8-0 పారుపత్యదార్ ఖచేరిలో చెల్లించినంతట మేళమునకు టిక్కెట్ ఇచ్చెదరు. అదిమేళగాండ్రకు చూపించి బసయున్ను, మేళముకావలసిన కాలమున్ను చెప్పినంతట వాండ్లువచ్చి మేళమువాయించి టిక్కెట్ వాపసుపుచ్చుకొనెదరు. ఒకేదివసమున అనేకయాత్రికులు మేళమునకు సొమ్ము చెల్లించినంతటనందఱుకుముహూర్త సమయమునకు మేళమువచ్చుట అసాధ్యముగనుక కొంచెము హెచ్చుతగ్గు కాలములో వచ్చి వాయించెదరు. మేళమునకు సొమ్ము చెల్లించినవారిలోఁ గొందఱు తమకు ఘంటలకొలఁది మేళము వాయించమని కోరెదరు. అట్లు చేసినయెడల మేళ

మునకు సొమ్ము చెల్లించిన నితర యాత్రికునకును, శ్రీవారి పనులకును అభ్యంతరము గలుగును. కనుక వీలుపడదు. మేళము సకాలమునకు రాలేదని యాత్రికులు ఫిర్యాదు చేయఁగూడదు.

## 2. నిత్యహారతి.

శ్రీవారికి నిత్యము హారతి జరుగుటకు దేవస్థానపు ఖచేరిలో నిత్యకర్పూర మంగళహారతికి రు 30 లున్ను, నిత్యనవనీత హారతికి రు 50-లున్ను చెల్లించిసంవత్సరము 1-కి ఇవిజరిపించుటకుగాను యాత్రికులు తమ ఏజంటుకు సంవత్సరము 1-కి ఖచేరిలో చెల్లించినంత మొత్తమిచ్చినంతట హారతి జరిపించును. లేనంతట శ్రీవిచారణకర్తలవారికి అర్జీవ్రాసుకొని దేవస్థానము ద్వారా జరిపించుటకు ఏర్పాటుచేసుకొనినంతట వేఱే ఏజంటులేకనే దేవస్థానమునకు ఆసొమ్ము చెల్లింపవచ్చును. కొందఱు తమయిండ్లముందఱకు దేవుని ఉత్సవము వచ్చినప్పుడు హారతిచేయ నిత్యహారతికే సొమ్ముచెల్లించెదరు. అంతమాత్రముచేత దేవుడు అక్కడ ఆగవలెనను నుద్దేశ్యముగాదు. దేవుని ఉత్సవమువచ్చుచుండగా హారతిఇవ్వవలెనను ఏర్పాటుగా నెఱుంగునది.

## 3. నిత్యఅర్చన.

నిత్యఅర్చనకు రు 42-లు దేవస్థానపు పారుపత్యదార్ ఖచేరిలో చెల్లించవలెను. తఱువాత తులసిమొదలగు ఖర్చులకు సంవత్సరము 1-కి రు 42-లుచొ॥ఏజంటు మూలకముగగాని పైచెప్పిన ప్రకారము దేవస్థానమూలకముగ గాని జరిపింపవలెను.

నిత్యహారతిలేక నిత్య అర్చన జరిగించు యాత్రికుఁడు తమ ఏజెంట్లు ప్రతిదినము జరుపక సంవత్సరమునకు వేయవలసిన

365 హారతులు, లేక, అర్చనల సామానులు రెండు మూడు దఫాలుదెచ్చి పూర్తిచేసెదరు. అట్లు చేయకుండ నేర్పాటు చేసుకొన వలయును.

### 4. శ్రీపాదచందనము.

శ్రీవారికి ప్రతినిత్యము రాత్రిమంచపు శేవకాలములో సమర్పణయి తెల్లవారి విశ్వరూపదర్శన కాలములో కొంత ఖర్చుపడి మిగతలో స్వల్పము అర్చకులకు చేరును. తక్కినది దేవస్థానము పారుపత్యదార్ వద్దనుండును. విచక్షణగ వారివల న భక్తులకు ఖర్చుపెట్టబడును. అర్చకులవద్ద వెలకుదొరకును.

### 5. శ్రీపాదరేణువు.

శ్రీవారికి సమర్పణ అయిన పచ్చకర్పూరము పునుగు తైలము మిశ్రమమునకు శ్రీపాదరేణువు అనిపేరు. దేవస్థాన మువారు సాధ్యమైనంతవరకు స్వల్పముగా భక్తులకుచితా ర్థమిచ్చెదరు. వెలకు అర్చకులు మొదలగుకొందఱు కైంకర్య పరుల వద్దదొరకును. అభయహస్తములు అనగా శ్రీవారిహస్త ముకు నొత్తబడి రేకలుగల్గిన చందనపు బిళ్లలు.

మాణిక్యములు, అనగా శ్రీవారిహస్తకవచముననున్న రత్నములకు నొత్తబడిన చందనపుబిళ్లలు. పుళికాపుతీర్థము అనగా శ్రీవారికి శుక్రవారమున జరిగిన అభిషేకతీర్థము. దీనిని యాత్రస్థులు తమ ప్రదేశములకు తీసుకొని వెళ్లెదరు. వారము దివసములు నిల్వయుండును. యాత్రస్థులు ప్రసాద ములు కానున్నప్పుడు అవిసరిఅయిన ప్రసాదములని నిర్ధారణ చేసుకొనవలెను.

## 6. షరాబు.

భుజమున సంచివేసుకొని యాత్రికులుండు తావునకు వచ్చి రూపాయలకు చిల్లరయున్ను, నవరములకు రూపాయలున్ను నిచ్చెదమని కొందఱు షరాబులు వచ్చెదరు. ఇంకను కొందఱు తిరుమల బజారువీధిమధ్యగ అంగళ్లుపెట్టుకొని చిల్లర, రాగి, రూకలు, వెండి కుండ్లు కండ్లు, కాళ్లు మొదలగునవి హుండీలో వేయుటకు యాత్రీకులకు విక్రయించెదరు. వీరితో బేరముచేయునప్పుడు యాత్రీకులు జాగరూకతతో వర్తింపవలెను. ప్రార్థనలేనిది రాగిరూకలు మొదలగునవి కొని హుండీలో వేయనవసరము లేదు. అట్లు వేయవలెనను నిర్బంధము దేవస్థానములో లేదు.

## 7. ముడుపులు.

శ్రీవారి ముడుపులు శ్రీవారికే జేర్చవలెను. ఇందుకుడలాలీలు తరగర్లు కమీషన్ ఏజంట్లు చెప్పుసంగతులు గురించి జాగ్రతగ నుండవలెను. డలాలీల దుర్బోధనను వినినయెడల యాత్రికులప్రార్థనలు సఫలము కానేరవు. అని శ్రీవిచారణకర్తలవారు నోటీసులు ప్రచురపరచినారు. యాత్రీకులు ఇతరులనునమ్మక స్వయముగ వారే స్వామివారి కొప్పెరలో వేసుకొనవలెను.

## 8. చంద్రగిరిరస్తా.

తిరుమలకు తిరుపతిమార్గమేగాక చంద్రగిరి మార్గమున గూడరావచ్చును. అయితే తిరుపతిరస్తావలె రాజభాటగాదు. డోలీలు బండ్లు ముందు ఏర్పాటుచేసుకోనంతట దొరకవు. ఈ

మార్గమున గూడ దేవస్థానపుభటులు గలరు. చలిపందిలిన్ని గలదు.

9. తిరుమల అంగడివాండ్రు.

వీరిలోన నేకుల స్వాధీనములో బాడుగ ఇండ్లు గలవు. వీరు యాత్రికులకు నిండ్లు బాడుగ కిచ్చెదరు. శ్రీవారికి కర్పూరము ఖరీదుచేసి కొప్పెరలో వేయమనెడి దుర్బోధనలు వినక యాత్రికులు తమ ప్రార్థనలప్రకారము నడుచుకొనవలెను.

10 కోతులు.

తిరుమలలోను తిరుపతిలోను కోతులుగలవు. తిరుమల మీదమెండు. కోతులు అరటిపండ్లు టెంకాయముక్కలు మొదలగుతినుబండారవస్తువులు చూచునప్పుడు మనుష్యులకు అడ్డమువచ్చును వాటినిచ్చివేయవలెను. లేనంతట కనబడకుండా నుంచుకొనవలెను. నిర్హేతువుగా కోతులు ఎవరికిన్నిహానిచేయక సంచరించుచుండును.

11. శాసనములు.

దేవస్థానపుప్రాకారములమీదనే నేక శాసనములుగలవు. ఇదిగాక తాళపాకము వారికృతులు రాగిశాసనములుగనున్నవి.

12. భావులు తులసి పుష్పం.

విరజానది అనునొక చిన్నభావి ఆకారముగలదిసంపగ ప్రాకారములోగలదు. శ్రీవారిపాదములక్రింద ప్రవహించు ఒక్కనది అగు విరజయొక్క తీర్థము ఈచిన్నభావి గుండ నరులకు ప్రాప్తమనిన్ని చెప్పెదరు.

శ్రీవారికి సమర్పణ అయినపుష్పము తులసి ఎవరున్ను ధరించుకొనగూడదు. ఈతులసిపుష్పము తిర్చుచానూరు పంచ

మి తీర్థముక్కోటి దివసమున శ్రీతాయార్లు వారి సమర్పణకు తిరుమలనుండి పంపబడిసమర్పణయిన తర్వాత ఒక సంవత్సర మున కొక దివసము మానవులకు ప్రాప్తము. ఇతర కాలములలో శ్రీవారిప్రదక్షిణములోని పూలభావిలో వేయబడును.

బంగారు భావిఅనునది శ్రీవారికి విమానప్రాకారముల లోనున్నది. ఈతీర్థము శ్రీవారిసన్నిధిలోను, వంటశాలలోను నుపయోగము.

## 13. ఉగ్రాణము.

శ్రీవారివంటశాల సామానులు బియ్యము మొదలగు నవి యుంచు శాలకు ఉగ్రాణమని పేరు. ఇది విరజానది వద్ద నున్నది.

## 14. జ్వరగాలి.

ఇచ్చటవేసవి కాలమందు గాలి హెచ్చుగవీచును. దీనిని జ్వరగాలి అనెదరు - శ్రావణ మాసములో తిరుమల గ్రామ మునకు కనబడుచుండు నారాయణగిరి మీాద శ్రీ వారి పాద ములకు సంవత్సరమున కొకసారిపూజ జరుగును. అప్పుడు జ్వర గాలి తగ్గును.

## 15. నీటివసతి.

తిరుమల వీథులలో కొళాయిలు గలవు. తిరుమల గ్రామమునకు వెలుపల నైౠతిన ప్రదేశములో ఆళ్వార్ చెరువు అనెడి కోనేరుగలదు. అందలి తీర్థము కొళాయికి వచ్చును. ఇదిగాక భావులు గలవు. ఈ కోనేటిని హిందూస్థాన దేశస్థులు "సూర్యకుండు" అని వాడెదరు.

16. బంగళా.

ఆళ్వార్ చెరువు సమీపమున దేవస్థానమునకు సంబం ధించినతోటలో బంగళా గలదు. దేవస్థానపు విచారణ కర్త వారిడుత్తరవు మీద యాత్రికులు వచ్చి వాసము చేయవచ్చును. బంగళాకు ప్రక్కనుండి చంద్రగిరికిపోవుమార్గము. ఈబంగ ళా వెనుకనుండిచూచినంతట కొండలు లోయలు మొదలగు ప్రకృతి చిత్రములు ఆహ్లాదకరములుగనుండును.

17. తరిగొండవెంగమ్మ.

తరిగొండ వారు శ్రీవారిదేవస్థానపు మిరాశీదార్లలో నొకరు. అందులో తరిగొండ వెంగమ్మ అనునామె చాలాభక్తు రాలు. ఈమెకుఆంధ్రమునమంచిప్రవీణతగలదు. ఈమెసమాధి గ్రామమునకు నుత్తరపువైపునగలదు. అచ్చటకు యనేకులు వెళ్లిచూచెదరు.

18. శానిటేషన్.

తిరుమల గ్రామముయొక్క శానిటేషన్ దేవస్థానము వారే చూచెదరు. అందుకు శానిటరీయిన్స్పెక్టర్ మొదలగు వారు గలరు. దేవస్థానముడిస్పెన్సరి ఒక్కటిగలదు. గోగర్భము నకు వెళ్లుత్రోవలోకలరాప్లేగుషెడ్లుగలవు.

19 శ్రీగోవిందరాజస్వామి వారి దేవస్థానం.

ఈ దేవస్థానము తిరుపతిలోగలదు. శ్రీగోవిందరాజస్వామి వారు శయనమూర్తి తిరుమల నుండి వచ్చుయాత్రికు లీ దేవ స్థానములో శ్రీగోవిందరాజస్వామివారి దర్శనము చేసుకొనెదరు.

## 20. శ్రీరామస్వామి వారి దేవస్థానం.

ఈ దేవస్థానము తిరుపతిలో నున్నది. ఈ దేవస్థానము జాంబవంతుని ప్రతిష్ఠ అని చెప్పెదరు. యాత్రికు లిచ్చటకు దర్శనమునకు వెళ్లెదరు.

## 21. శ్రీపద్మావతి అమ్మవారి దేవస్థానం.

శ్రీశుకులు తపస్సు చేసుకొనుటచేత శుకపురి అని పేరుగలిగెను. దానిని అరవముతో శుకనూరు అని వాడెదరు. దానికి వైష్ణవసిద్ధాంతపదమగు తిరుశబ్దము జేర్చి తిరు శుకనూరు అనివాడిరి. అదిక్రమేణ తిరుచానూరు అని వాడబడు చున్నది. ఇది తిరుపతికి రెండుమూడుమైళ్లదూరమున నున్నది. ఇక్కడ శ్రీ పద్మావతి అమ్మవారి దేవస్థానము గలదు. శ్రీపద్మావతి అమ్మవారిని శ్రీఅలివేలు మంగమ్మ అనియు తిరుచానూరిని అలివేలుమంగాపురమనిన్ని కొందఱు వాడెదరు. శ్రీవెంకటేశ్వర స్వామివారిదర్శనమునకు వచ్చు యాత్రీకులు శ్రీస్వామివారి పత్నియగు శ్రీపద్మావతి అమ్మ వారి దర్శనమునకు తప్పక వెళ్లెదరు. సంవత్సరమున కొకసారి యేప్రిల్ నెలలో తెప్పోత్సవము జరుగును. అరవకార్తికనెలలో బ్రహ్మోత్సవము జరుగును. ఈ దేవస్థానములన్నియు శ్రీవెంకటేశ్వరస్వామివారి దేవస్థానమునకులోబడి తత్సంబంధమైన రాబడీ మీదప్రబలుచుండును.

## 22. తిరుమల అడవి.

తిరుమలమీద కొంతఅడవి శ్రీవారికి చెందుచున్నది. ఇదిగాక ప్రస్తుతపు శ్రీవిచారణకర్తలవారివలన రెండుతాలూకాలు ఖరీదుచేయబడినవి.



85. శ్రీ పద్మావతమ్మవారి పడికావలిగోపురము (లోభాగము.)



85. పద్మావతితాయార్లు.

23 వాహనములు.

శ్రీవారికి బంగారు వెండి వాహనములు గలవు. సర్వ భూపాలవాహనము బంగారు వాహనము ఒక్క లక్షరూపా యాలు వెలగల్గిన వాహనము.

24. శివలింగం.

శ్రీనివాసమూర్తివారి విమానప్రదక్షిణమున [illegible] ర్భాగ శ్రీమార్కండేయముని పూజించుకొనియుండు శివలింగ దర్శన మగును.

25. దేవతలు.

శ్రీవారి దేవస్థానము గర్భాలయములో శ్రీమూలవిగల వక్షస్థల లక్ష్మీసహితముగనున్న శ్రీదేవి భూదేవిసమ్మేతులైన సహా శ్రీమలయప్పస్వామి వారు అను ఉత్సవర్లున్ను, శయ్యాసేవ చేయు శ్రీభోగ శ్రీనివాసమూర్తివారున్ను కొల్వు [illegible]గా నిత్యము దర్బారు చేయుకొల్వు శ్రీనివాసమూర్తి వారున్ను సంవత్సరమున కొకదినము రాత్రియందు మొదటి [illegible] ఉగ్ర శ్రీనివాసమూర్తివారు తాయార్లు కోనున్న సీతాలక్ష్మణసమేత శ్రీరాములువారున్ను రుక్మిణీసమేత శ్రీకృష్ణస్వామివారున్ను చక్రత్తాళ్వారను సుదర్శనమున్ను విజయంచేసి యున్నారు. గర్భాలయమునకు ముందుపై నియేర్పబడిన మూర్తులకు కొన్నిగజముల దూరమునని౦కొక ప్రదేశమున నొకపార్శ్వంబున సుగ్రీవ అంగద హనుమాన్లున్ను, రెండవపార్శ్వమున అనంతగరుడవిష్వక్సేను లున్ను గలరు. వారికి ముందు కొన్నిగజముల దూరమున బంగారువాకిలి ముందు ఇరుప్రకల జయవిజయులను ద్వారపాలకులున్ను, వార్లకు వెండి కటాంజనముతో గుడివలెకట్టబడియు

న్నది. గర్భాలయము అనఁగా బంగారువాకిలిదాటి విమానప్రదక్షిణములో దేవతలగు శ్రీయోగనృసింహస్వామి శ్రీవరదరాజస్వామి దేవస్థానములున్ను భక్తులగుశ్రీభాష్యకారులు, శ్రీసేనాధిపతి, శ్రీగరుడాళ్వార్లు దేవస్థానములు గలవు. వంటశాలలో శ్రీవకుళమాలికాదేవిగుడిగలదు. ధ్వజస్తంభము వద్ద క్షేత్రపాలకశిలగలదు. ఇచ్చటనే అర్చకులు ఇంటికి వెళ్లినపుడున్ను దేవస్థానమునకు వచ్చునపుడున్ను బీగము చెవులు తాకించి వెళ్లవలెను. క్షేత్రపాలకులుపూర్ణకళతో గోగర్భమువద్దనున్నారు. వీరిప్రభావము గుఱించి అనేక కథలుగలవు.

26. ముద్రమండపం.

ఎవరయినను శ్రీవారిదేవస్థానములో తప్తాంకితముచేసుకొనవలెనన నఫరు 1-కి రుసుం 0-12-4 వంతున పారుపత్యదార్ ఖచేరిలో చెల్లించినయెడల ఒక్క శ్రీవైష్ణవబ్రాహ్మణునిచే వారికి చక్రాంకితము కావింపబడును.

---

## అధ్యాయము. VIII.

### తీర్థములు.

ఈ పర్వతమున 360 తీర్థములుగలవనియు అందులో కొన్ని అంతర్థానమనియు, కొన్ని మిగుల కష్టసాధ్యమనియు చెప్పెదరు. యాత్రికులకు సులభసాధ్యములగు తీర్థములు కొన్ని గలవు.

1 శ్రీస్వామిపుష్కరిణి.

ఈ తీర్థమునుగురించి అనేకపురాణములు బహుతెరంగుల వర్ణించినవి. ఏ పురాణములో జూచిననీతీర్థ మహాత్మ్య



86. తిరుచానూరు పద్మసరోవర సింహావలోకనము.



87. నీ రా ళి మ ం ట ప ము.

మద్భుతముగా చెప్పబడినది. గ్రంథబాహుళ్యమగునని స్వల్పము నిందు చెప్పబడినది.

శ్రీస్వామి పుష్కరిణి గంగాది మొదలగు సర్వతీర్థములకు జన్మభూమనియు, పంచమహాపాతకములు పోగొట్టునదియు, స్నానమాత్రమున నైహికాముష్మికముల నిచ్చునదియు, దాగ వైకల్యదోషములను బోగొట్టునదియు, వైకుంఠమునుండి శ్రీమహావిష్ణు అమ్మవార్లసహా క్రీడార్థం శ్రీస్వామిపుష్కరిణి తీరమునకు వచ్చినారనియు మొదలగు మహిమవర్ణింపబడినది.

శ్లో. స్వామి పుష్కరిణీ పుణ్యా సర్వపాపప్రణాశనీ।
వైకుంఠే భగవత్క్రీడా వాపశ్రీ భూమిలాలితా॥

శ్లో. అవాక్ఛృతజకాఘాచసుగన్ధా సుమనోహరా।
గఙ్గాదిసర్వతీర్థానాం జన్మభూమి శ్శుభోదకా॥

శ్లో. ఆనీతా వైనతేయేన క్రీడార్థం తత్ర తిష్ఠతి।
విరజావద్రజోదోషప్రముఖాఘవినాశినీ॥

వరాహపురాణము.

ఈ తీర్థములో మధ్యగనొక చక్కని రాతిమంటపము గలదు. అందు దశావతారములు శిలలో బాగాశిల్పము చేయబడినవి. ఈమంటపము నాలుగు వత్సరముల క్రిందట జీర్ణోద్ధారము జేయబడినది.

ఈ తీర్థము శ్రీవారి దేవస్థానమున కుత్తరభాగమున ప్రాకారమునకు మూడుగజములదూరమున నున్నది. యాత్రికులందరు నిందు స్నానముచేసి శ్రీవారి దర్శనముగావించెదరు.

ధనుర్మాసములో శుక్లపక్షద్వాదశి అరుణోదయము ఈ తీర్థమునకు ముక్కోటి. శ్రీవారి దేవస్థానంనుండి చక్రతాళ్వార్

వేంచేసి స్నానముగావించెదరు. అప్పుడు విశేషముగ జనముండి చక్రత్తాళ్వార్‌తోఁగూడా స్నానమొనర్చెదను. ఈ సమయమున సర్వతీర్థములందుండుననియు దేవతలందరచ్చట స్నానముచేసెదరని చెప్పెదరు.

శ్లో. ధనుర్మాసే సితే పక్షే ద్వాదశ్యామరుణోదయే।
ఆయాన్తి సర్వతీర్థాని స్వామిపుష్కరిణీజలే॥

శ్లో. తత్ర స్నాత్వా నరస్సద్యో ముక్తిమేతి న సంశయః।
యస్య జన్మసహస్రేషు పుణ్యమేవార్జితం పురా॥

శ్లో. తస్య స్నానంభవేద్వి ప్రానాన్యస్యత్వ కృతాత్మనః।
విభవానుగుణం దానం కార్యం తత్ర యథావిధి॥

శ్లో. సాలగ్రామశిలాదానం గాం దద్యాచ్ఛవిశేషతః।
యే శృణ్వన్తి కథాం విష్ణోస్సదాభువనపావనమ్॥

స్కాన్దపురాణము.

## శ్రీవైకుంఠ తీర్థము.

శ్రీస్వామి పుష్కరిణికి ఈశాన్య భాగమున రెండు మైళ్లదూరమున నొక గుహగలదు. దీనిపేరు వైకుంఠ గుహ యని వాడెదరు. ఈగుహాలోనుండి తీర్థము సదావచ్చుచుండును దీనిని వైకుంఠ తీర్థమనెదరు. శ్రీరాములవారు పంపానది దాటి వానర సైన్యముతో లంకకుఁ బోవుచున్నప్పుడు శ్రీస్వామి పుష్కరిణీ తీరమున నిల్చిరి. వానర బలపరాక్రమ శాలురైన గజ గవాక్ష గవయశ్శరభగంధమాధ నాదులు, సింహతుల్య పరాక్రమశాలురు ఆగుహ ప్రవేశించిరి. కోటిసూర్య ప్రకాశమానమైన నొక తేజస్సును, ఒక పట్టణమును జూచిరి.



88. నీరాడిమంటపము, పడమటిభాగము.



89. కీలాడీమంటపము, దక్షిణభాగము.

శ్లో. తత్ర కాచిత్పురీ రమ్యా త ప్తహాటకనిర్మితా।
కవాటతోరణవతీ రమ్యాద్వ్యాళశ్చైత్యతా॥

శ్లో. స్ఫటికోపలసచ్ఛుద్ధజలనద్యా సమావృతా।
రత్న మాణిక్య వైడూర్య ముక్తా నిర్మితగోపురా॥

శ్లో. అనేక మండప ప్రైర్యుక్తా ప్రాసాదశిఖ సంకులా
మహావీధి శోభోపేతా నిఖమాలి సంయుతా

శ్లో. వరనారీగణోపేతా సర్వమంగళశోభితా।
శంఖచక్రధరా స్తత్ర సర్వేచైవ చతుర్భుజాః॥

శ్లో. సశుక్లమాల్యవసనాస్సర్వాభరణభూషితాః।
దివ్యచందన లిప్తాంగాః పరమానందపూరితాః॥

శ్లో. తన్మధ్యేసుమహద్దివ్యవిమానం సూర్యసన్నిభం।
అత్యున్నతమహామేరుశృంగతుల్యం మనోహరం।

శ్లో. బహుప్రకాశసంపన్నం మణిమండపసంయుతం।
భేరీమృదంగపణవమర్దలధ్వనిశోభితం॥

శ్లో. నృత్తవాదిత్రసంపన్నం కిన్నరస్వనసంయుతం।
దదృశుస్తత్ర పురుషం పూర్ణచంద్రనిభాననం॥

శ్లో. చతుర్బాహుముదారాంగం శంఖచక్రధరంపరం।
పీతాంబరధరం సౌమ్యమాసీనం కాంచనాసనే॥

శ్లో. ఫణామణిమహాకాంతి విరాజితకిరీటినం।
భోగిభోగేసమాసీనం సర్వాభరణభూషితం॥

శ్లో. ఆసనోపరివిన్య స్తవామే తరకరంభుజం।
ప్రసార్యదక్షిణంపాదము ద్ధృతేవామజాను॥

శ్లో. ప్రసార్య వామహస్తాబ్జం శ్రీభూమిభ్యాం నిషేవితం।
సేవితంగీశయా దేవ్యావై జయంత్యావిరాజితం॥
శ్లో. శ్రీవత్సకౌస్తుభోరస్కం వనమాలావిభూషితం।
కృపారసతరంగౌఘ పూర్ణ నేత్రాంబుజద్వయం॥
శ్లో. శశిప్రభాసమచ్ఛత్రం చామరవ్యజనేశుభే।
హస్తాభ్యాం ధారయంతీ భిర్నారీభిస్సేవితం ముదా॥

వరాహపురాణము.

ఈప్రకారము చూచుచుండగా చతుర్బాహువులు గల యొక పురుషుడుకత్తితో కొట్ట వచ్చినట్టు కనపడ వారలందరు భయపడి గుహబయటికి పారివచ్చి యిదంతయు తమ మిత్రులకు దెల్పి మహామాయి కామరూపి మొదలగు వానర సముదాయమంతయు బయలుదేరి వెళ్లి గుహయందంతయు పరిశీలించి అదేమియు గానక తిరిగి వచ్చిరి. ఈగుహ చొచ్చుట మునులకు యోగులకు కష్ట సాధ్యము. శ్రీమన్నారాయణ లీలావిలాసముచేత ఈవానర శ్రేష్టులకు శ్రీమహావిష్ణువుండు లోకము దర్శనమాయెను. కలియుగములో జనుల నుద్ధరించుటకు గాను శ్రీమన్నారాయణుండు ఈగుహలో ఈమాదిరిగా నుండును. ఈప్రభావము వినినంత మాత్రముననే కలికాలములో జనులకు దోషములు పోయి సమస్త సుఖంబులు బడయుదురు. ఈగుహలో నుండివచ్చెడి తీర్థము సాక్షాత్ వైకుంఠములో నుండి వచ్చుచున్నందున నిందలి స్నాన ఫలము చెప్పనలవిగాదు.

౩ పాండవ తీర్థము.

శ్రీ స్వామివారి దేవస్థానమునకు వాయవ్య మూలలో నుమారుమైలు దూరమున నొకతీర్థము గలదు. అది శ్రీక్షేత్ర

పాలకులచే కాపాడబడు చున్నది. ఇచ్చట ఒక్కసంవత్సరము నివసించి ఆతీర్థము స్నానపానముల నుపయోగించుచు [illegible] తటు [illegible] క్షీణించును పుణ్యము చేకూరును. ఇదే [illegible] పాండవు లీతీర్థము దొక సంవత్సరము నివసించి [illegible] గాంచిరి. అనంతరము యుద్ధమున జయించి రాజ్యమును [illegible] సాధించిరి. ఇచట స్నానము చేసిన [illegible] భాగ్యులై సుఖము ననుభవించెదరు.

శ్లో. వృషభస్థే రవౌ రాధే ద్వాదశ్యాం [illegible]
శుక్లే వాప్యథవా కృష్ణే పక్షే భానుదినేపి వా
శ్లో. తత్రైపాండవనామ్ని [illegible] స్నాతి యోనరః
నేహదుఃఖ మవాప్నోతి పరత్రసుఖమశ్నుతే.

## 4. జాబాలితీర్థము.

శ్రీ స్వామి పుష్కరిణికి ఉత్తరభాగమున [illegible] మైళ్లు దూరములో జాబాలి తీర్థముగలదు. ఇచ్చట జాబాలిఋషి యొక్క ఆశ్రమముండెను. కొంతకాలమైన తర్వాత తిరిగి రాగల నుద్దేశ్యముతో ఒక్కొక్కరే ఆశ్రమమును వదలి వెళ్లిరి.

అగస్త్యులు వారిచ్చట ననేక యుగము లనుండి భక్తులు రాజులతోఁ గలిసి శ్రీవారిని గురించి అద్భుతముగా పూజాదులు జరుపు చుండిరి. ఈతీర్థములో స్నానము చేసినంతట పంచమహాపాతకము సహా పోవుటయే గాక పిశాచములు వదలును. ప్రాయశ్చిత్తము లేని దోషములు గూడనశించును.

కావేరీ నదీతీరమున దురాచారుడను నొక బ్రాహ్మణుండుండెను. ఎల్లప్పుడు క్రూరకర్మయేగాని సుకృత్యము లెన్నడుచేసిన వాడు కాడు. పంచమహాపాతకములు సదా చేయువాడు. ఈ దుష్కర్మవల్ల నొకబ్రహ్మరక్షసి అతనికి పట్టియనేక దేశములు త్రిప్పెను. పూర్వపుణ్యఫలము వలన నీదురాచారుడు పిశాచ పీడితుడయ్యు నీవెంకటాద్రికివచ్చి యీతీర్థములో స్నానము చేసెను. వెంటనె తన దుష్కర్మ మంతయు పోయి పిశాచము తొలగుటయే గాక దానికిన్ని విముక్తిగలిగెను. పిశాచము తొలగినందు వలన తెలివిగలిగి చెంతనున్న జాబాలి ఋషి వద్దకు బోయి "నేనుకావేరి తీరముననుండి దుష్కర్ముముచేయు చు దురాచారుడను నామమున బిలువబడు చుంటిని, నేని ప్పుడు ఎక్కడనుంటినో నెటులనిక్కడకు వచ్చితినో దెలుపవేడెద నన" నాముని ముహూర్తమాత్ర మాలోచించి కనికరము గలిగి "పూర్వమొకానొక బ్రాహ్మణుండు పితృశ్రాద్ధము పార్వ ణ విధానముగ చేయనందున పితృశాపము వలన పిశాచరూ పము బొందెను. ఆపిశాచముసదా దుష్కర్ముండవగు నిన్ను దేశమంతయు త్రిప్పి తుదకు నీపుణ్యమువలన నిక్కడకు తీసు కొని రాగా ఈతీర్థస్నానముచే నాపిశాచమునకుముక్తి గలిగె ను. నీకు దుష్కర్మ తొలిగెను."

శ్లో. యాని నిష్కృతి హీనాని పాపాన్యపి వినాశయేత్।
శూద్రేణ పూజితం లిఙ్గం విష్ణుంవాయోనమోద్విజః॥

శ్లో. ప్రాయశ్చిత్తాంగత స్సోక్తం స్మృతిభిః పరమర్షిభిః।
నశ్యేత్త స్యాపి తత్పాపం తీర్థె జాబాలిసంజ్ఞకే॥

శ్లో. విప్రనిన్దాకృతాం చైవ ప్రాయశ్చిత్తం న విద్యతే।
విశ్వాసఘాతుకానాం చ కృతఘ్నానాం చ నిష్కృతిః॥
శ్లో. భ్రాతృభార్యా రతానాం చ ప్రాయశ్చిత్తం నవిద్యతే।
తేషాం జాబాలితీర్థే వై స్నానాచ్ఛుద్ధి ర్భవిష్యతి॥

5. కటాహ తీర్థం.

గంగా నదికి దక్షిణభాగము 200 ఆమడ (యోజనము) దూరమున తూర్పు సముద్రమునకు పంచభిర్యోజనదూరము పశ్చిమముగా సువర్ణ ముఖీనదీ తీరమున నుత్తరముగా క్రోశ డుదూరములో సమస్తులవలన వందింపబడు వెంకటాద్రిగలదు. ఆవెంకటాద్రీశుని మేరుపుత్రుడు దేవతలు ఋషులు మొదలగు వారు సాక్షాత్ శ్రీమన్నారాయణుడని పూజించెదరు. మోక్ష ప్రదాయకుండై శ్రీవెంకటేశ్వరుని చుట్టుకొని శ్రీమహాలక్ష్మియు భూనీళా దేవులున్నారు.అట్టి వెంకటేశుని ఆలయములో నుత్త రభాగమున విమానప్రదక్షిణములో నున్నదని భారద్వాజ ఋషి చెప్పిరి. ఇందలి తీర్థమును స్పర్శదోషము లేకుండా బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రులు నాల్గుజాతుల వారు తీసుకొనె దరు. ఇందలి తీర్థపానము బ్రహ్మహత్యాది మహాదోషములను గూడ బోగొట్టిముక్తి దాయకముగ నున్నది. నాల్గు ఆశ్రమ ములవారు ఇందలితీర్థముసేవించి ముక్తిబొందెదరు. కుష్టుమొద లగు కర్మవ్యాధుల సహాపోగొట్టును.

శ్లో. స్మృతిమాత్రేణ యత్పుంసాం సర్వపాపనిషూదనం,
మంత్రేణాష్టాక్షరేణైవ పిబే తీర్థ మనోహరం.
శ్లో. అథవా కేశవాద్యైశ్చ నామభిర్వాపిబేజ్జలం,
యద్వానామత్రయేణాపి పిబేత్తీర్థం శుభప్రదం.

శ్లో. అహోస్విద్వేఙ్కటేశస్య మంత్రేణాష్టాక్షరేణ వై।
పిబేత్కటాహతీర్థం తద్భుక్తిముక్తిప్రదాయకం॥
శ్లో. వినా మంత్రేణ యో విప్రస్సం పిబేత్తీర్థముత్తమం।
పాపంమే నాశయక్షిప్రం జన్మాంతర కృతంమహాత్॥
శ్లో. ఇత్యుక్త్వా న పిబేన్నిత్యం మోక్షమార్గైక సాధనం।
స్వామిపుష్కరిణీ స్నానం వరాహ శ్రీశదర్శనం॥
శ్లో. కటాహతీర్థ పానం చ త్రయంత్రైలోక్య దుర్లభం।
బహునా కి మిహోక్తేన బ్రహ్మహత్యా దినాశకం॥

స్కాన్దపురాణము.

పూర్వము తుంగభద్రానదీతరమున వేదశాస్త్రపారంగతుడైన పద్మనాభశర్మ అనుబ్రాహ్మణోత్తముండుగలడు. ఆయనకు కేశవశర్మ అనుపుత్రుండు గలడు. ఆపుత్రుండు దల్లిదండ్రులను భార్యనుస్వకర్మలను వదలి జూదమాడుచు, సురాపానము జేయుచు, వేశ్యాంగనల నిండ్లభుజించుచు గాలము గడుపుచుండెను. ద్రవ్యముకొఱకు దొంగతనము జేయుచు. చేత ఖడ్గము బూని బ్రహ్మహ్యత లొనర్చుచుండెను. ఒకేపుత్రుడిటుల దుష్కర్ముఁడయ్యెనని దుఃఖించుచు తండ్రి తుదకు భరద్వాజ ఋషికడకేగి నమస్కరించి జెప్పుచుకొనగవారు ఈతీర్థముపుచ్చుకొన్నంతటన్ని దోషములు పోవునని చెప్పనటుల నాబ్రాహ్మణుఁడు పుత్రుని తీసుకొనివచ్చి శ్రీస్వామిపుష్కరిణి స్నానము గావించి శ్రీవరాహస్వామివారి దర్శనముచేయించి శ్రీవేంకటేశ్వరస్వామివారి దేవస్థానమునకు తీసుకొనివెళ్లి విమానప్రదక్షిణంచేయించి తీర్థము పానంబుగావింప నాదుష్కర్మవి ముక్తిగలైను.

## ౯ కుమారధారాతీర్థము.

శ్రీస్వామి పుష్కరిణికి నుత్తరభాగమున మూడుమైళ్ల దూరమున పాపనాశనమను తీర్థముగలదు. ఈ తీర్థమునకు వాయవ్యభాగమున మూడుమైళ్ల దూరమున కుమారధారా తీర్థము గలదు.

కుంభరాశియందు రవియుండగా మఘానక్షత్రముతో కలసిన మాఘశుద్ధపౌర్ణమి నాటిమధ్యాహ్నము ఈతీర్థములో స్నానముచేసినంతట గంగాది సర్వతీర్థములందు స్నానముగావించిన ఫలము ప్రాప్తించి ఆయుష్యము 12 సంవత్సరము లుండును. ఈ తీర్థమం దెవరు దక్షిణాయుక్తముగా నన్నదానము గాని చన్దనతాంబూల దానముగాని చేస్తారో వారి స్నానఫలము బొందెదరు. ఈదినమున ప్రతిసంవత్సరము శ్రీవారిప్రసాదమైన పాలుచందనము, తాంబూలము తీసుకొనిపోబడి వినియోగమగును. ఈతీర్థమువద్ద ఒక్క ఇనుపనిచ్చెన యాత్రికుల సౌకర్యార్థము వేయబడినది.

శ్లో. ... ... ... ...

తస్మిన్ తీర్థే స్వర్ణ దానమణు మేరుసమంభ వేత్ ॥

శ్లో. వస్త్రం దానంచ గోదానం భూదానంచ తథోధికమ్।

యో నాదదాతి సత్ప్రీత్యా తస్య లక్ష్మీర్గృహే స్థితా॥

మార్కండేయపురాణము.

పూర్వకాలమున నొకానొకవృద్ధ బ్రాహ్మణుండెను. అతఁడు మిగుల దారిద్ర్యపీడితుడై కుటుంబసంరక్షణ చేసుకొన లేక నుండెను. దరిద్ర దోషమువలన నిహపర సాధనము లేక మిగుల దుఃఖితుడుగా నుండెను. ఈకష్టము భరింపమి ఒకనాడు

స్వర్ణముఖరీ సమీపమునబోయి చెంతనున్న శేషగిరిశిఖరమున కెక్కి "బ్రహ్మ విష్ణు మహేంద్రాది దేవతలారా నవగ్రహాశ్వన్యాదులారా సర్వభూతములారా! నేనతీత దరిద్రపీడితుండనై కుటుంబరక్షణ చేయ లేక నిహాలోక సుఖము లేక ధర్మాచరణ శక్తిచే పరలోక సుఖంబుగానక యున్నాను. వృద్ధుడనై దరిద్రదోషహతుడగుట జన్మ వ్యర్థంబు. పర్వతశిఖరంబుననుండి పతనంబుచే ప్రాణత్యాగంబు దోషంబు లేదని పెద్దలు వచించెదరు. నేను పడుచున్నాను పడుచున్నాను పడుచున్నాను" అనిపడబోవుచుండ శ్రీవేంకటేశ్వరస్వామివారు మృగయార్థమే తెంచిన నొక రాజపుత్రునివలె దర్శనమిచ్చి పర్వతము క్రిందనుండి "వలదు వలదు బ్రాహ్మణునకు భృగుపతనంబు దోషము పర్వతశిఖరంబు దిగిరమ్మ"నుచు జెప్ప నావిప్రుండు "ఓరాజా! నన్ను నాభార్య బిడ్డలను గాపాడినంతట నేను దిగెదను" అని ప్రత్యుత్తరమియ్య "సర్వందదామి" అని రాజపుత్రుడా నతియ్య నాబ్రాహ్మణుడుదిగెను. ఆప్రభువృద్ధ బ్రాహ్మణునికరము కరముచే బూనితీసుకొనివెళ్లి "పాపనాశనమున కుత్తరముననున్న ఈతీర్థమున స్నానముచేయుము దుఃఖశాన్తియై కౌమారము వచ్చును" అని చెప్పెను.

శ్లో. స్నానం కురు తతః ఖేద శాన్తిస్తత్ర భవిష్యతి।
ఇత్యుక్తే తత్ర తత్తీర్థే స్నాతోత్థాయ యువా భవత్॥

శ్లో. మనః ప్రసన్నతాం యాతంకుమారశ్చతదాభవత్।
తరంతు సర్వతః పశ్యంస్తమ దృష్ట్వా న్వ తప్యత॥

మార్కండేయపురాణము.

ఆ బ్రాహ్మణుండు స్నానము జేయుచుండగా నారాజపుత్రుం డంతర్ధానయాయెను. తన్నువదలి రాజకుమారుడెక్కడకు బోయెనని విప్రుండు విలపించుచుండ నంత నొక శబ్దము "ఓబ్రాహ్మణుండా! శ్రీవెంకటేశ్వరకృపాకటాక్షము వలన నిహలోకములో నైశ్వర్యసుఖము నీవు బొందితివిగదా! నీదేశమునకుబోయి భార్యాబిల్లలు సహితముగానుండుము. శరీరములో బలమున్నప్పుడే ధర్మముజేయుడి" అను మొదలగుహితోపదేశము వెల్లడిచేసెను. దరిద్రపీడితుడైన నీవృద్ధబ్రాహ్మణునకీ తీర్థస్నానమున కుమారత్వం ధనత్వం ప్రాప్తమాయెను. వృద్ధుండిందలి స్నానముజేసిన మాత్రమున కౌమారదశబొందె నందున కుమారధారతీర్థమని పేరుగల్గెను.

శ్రీకుమారస్వామి దేవసేనానిగానుండి దేవతల ప్రత్యర్థముతారకాసురుని సంహరించి నందువలన బ్రహ్మహత్యా దోషము బోవుటకు నీతీర్థములో ప్రణవపూర్వక శ్రీవేంకటేశాష్టాక్షర మంత్రము జపించుచు స్నానముజేసి నంతటా దోషము వారించునని పురంధరు డానతియ్యా నాయనట్లుజేసినందున ఆదోషముబోయెను. ఒక్కకల్పము ఈతీర్థమువద్ద శ్రీకుమారస్వామి శ్రీవారి అనుజ్ఞప్రకారమున్నారు.

## 7. చక్రతీర్థము.

ఈతీర్థము తిరుమలకు రెండుమైళ్లదూరమున వాయవ్యమూలలో నున్నది. ఇచ్చట పూర్వము శ్రీవత్సగోత్రీకుడైన పద్మనాభుడను బ్రాహ్మణుండు జితేంద్రియుండై పత్రోదకంబులు భక్షించుచు 12 సంవత్సరంబులు ఘోరంబుగా తపంబొ

చరించెను. రాక్షసబాధమిగుల హెచ్చుగనుండెను. శ్రీవేంకటే శ్వరస్వామివారుప్రత్యక్షమయి ఆఋషిని నిచ్చట నేనుండమని రాక్షసాదుల నివారింపతమ చక్రమిచ్చెను. ఈచక్రమునలన నసుర బాధనివారమాయెను. తపంబునల్పమిగుల నుత్తమక్షేత్ర మాయెను.

శ్రీరంగములో సుందరుండను బ్రాహ్మణుండు శాపమువలన రాక్షసరూపముబొంది ఈతీర్థమునకు వసిష్ఠమహాఋషి అనుజ్ఞప్రకారమురాగా సువర్ణముఖి నల్లరాక్షసత్వముతొలగి, తీర్థస్నానమువలన పాపములు పోయిముక్తి బొందెను.

ప్రతిసంవత్సరము కార్తీకబహుళ ద్వాదశినాడు మధ్యాహ్నం అచ్చటకు దేవస్థానమునుండి ఒక్కపాయసంతలిపా తీసుకొనివెళ్లి అచ్చట నున్న శ్రీలక్ష్మీ నృశింహస్వామివారికి సువర్ణ నమునకు అభిషేకమయిన తర్వాత ఆరగింపు వినియోగములు చేయబడును. అప్పుడు అందఱు తీర్థస్నాన మొనర్చెదరు.

## 8. ఆకాశగంగ.

ఇది శ్రీస్వామి పుష్కరిణి తీర్థమునకు ఉత్తరమున రెండు మైళ్లదూరమునగలదు. ఇచ్చట అంజనాదేవి త్రేతాయుగములో పన్నెండు సంవత్సరంబు లాహారంబులేక తపంబొనర్చి ఆంజనేయులనుగనెను. ఈ తీర్థము పర్వతములోనుండి ధారగా వచ్చును. చాలానిర్మలోదకము. నిత్యము శ్రీవెంకటేశ్వర స్వామివారి ఆరాధనకు మూడుబిందెల తీర్థమువచ్చును.

పూర్వకాలములో రామానుజుడను విప్రుండొకండు ఆకు అలములతినుచు ఘోరతంబుశేయ శంఖుచక్రధరుడై లక్ష్మీ



99. ఆకాశగంగ.

సమేతుడైన శ్రీమహావిష్ణువు పరివార సహితముగ ప్రత్యక్షమాయెను.

శ్లో. ఏతేనచక్రతీర్థేస్మిన్ వేఙ్కటేశ జగత్పతే,
యన్నామస్మృతిమాత్రేణ శోమహాపాతకనాశన,

శ్లో. ముక్తిం ప్రయాస్యసి మనుజాస్తం పశ్యామి జనార్దనమ్.
త్వత్పాదపద్మయుగళే నిశ్చలాభక్తిరస్తు మే.

"మేషమాసములో చిత్తానక్షత్రయుక్త పూర్ణిమనాడు ఈతీర్థములో స్నానమొనర్చినవారు పునరావృత్తి వర్జితసుఖంబునుబొందెదరు. రామానుజ! నీవు ఈ తీర్థము నొద్దవసించుము. కర్మానుభవముగ నీవు జన్మాంతరమున మత్స్య రూపంబు బొందెదవు. ఈ తీర్థములో స్నానముచేసినవారు భాగవతోత్తములగుదురు"ని శ్రీస్వామివారు చెప్పి భాగవత లక్షణంబువచించున్నారు.

1. సర్వహితము గనసూయ మత్సరాదులు లేక జ్ఞానమునిస్పృహత్వము శాంతము గలిగినవారు.

2. అపరిగ్రహశీలురుగ నుండినను మనోవాక్కాయకర్మలచే పరపీడ చేయనివారు.

3. సత్కథ శ్రవణమందు సాత్వికబుద్ధిగలిగి నాయందు భక్తిగలవారు.

4. పరనిందజేయక సుగుణగ్రహణము గావించువారు.

5. తల్లిదండ్రుల శుశ్రూషచేయువారు. దేవతార్చనయందాసక్తిగలవారు.

6. శత్రుమిత్రభేదము లేక "ఆత్మవత్ సర్వభూతాని" అను ప్రకారము నడచువారు.

7. ధర్మశాస్త్రవేత్తలు, వీర్లకు శిశ్రూషచేయువారు.

8. గో బ్రాహ్మణ శిశ్రూషచేయువారు. తీర్థయాత్రా పరులు.

9. అన్నదానము చేయువారు.

10. తోటలు, భావులు దేవాలయములు నేర్పరుచు వారు.

పూర్వకాలమున గోదావరితీరమున వేద వేదాంగ పారంగతుఁడు అగ్నిష్టోమాదిక్రతువు లొనర్చిన పుణ్యశీలయను నొక విప్రవర్యుండుండెను. అతడు పితృతిథికి నిమన్త్రణకు గాను గొప్ప పండితుండును అగ్నిష్టోమముచేసినవాడును సుశీలుడును అయిన నొక బ్రాహ్మణుని పిల్చెను. నిమన్త్రణానంతరము పుణ్యశీలుడు గర్దభముఖ ప్రాప్తిబొందెను. ఇందుకు దుఃఖితుడై కారణంబుగానక స్వర్ణముఖరీ తీరమందాశ్రమములో నుండు అగస్త్య ఋషివద్దకుబోయి వేడ వారిట్లు వచించిరి. "పుత్రుడులేని బ్రాహ్మణుని నిమంత్రణకు నిర్ణయించుటచే నిట్లు దోషముగల్గెను.

శ్లో. యేలోకేహక్యకవ్యాదౌ వన్ధ్యాయస్సా ృమినంద్విజమ్,
నియోజయన్తి తేయాన్తి ముఖేగార్దభరూపతామ్.

శ్లో. శుభకర్మణివాపి ప్రవైతృకేవాపికర్మణి,
వన్ధ్యాపతిమహాపాపం కదాచిన్ననిమన్త్రయేత్.

అని చెప్పుచు వెంకటాచలమందు వియద్గంగ గలదు. ఆ పర్వతమునకేగి అచ్చట సర్వపాపహరమగు శ్రీస్వామి పుష్కరిణిలో సంకల్పపూర్వముగా స్నానమొనర్చి తర్వాత నాకాశ గంగ తీర్థములో స్నానముచేసినంతట నీవికారరూపము బోవునని నతడట్లు జేయవికృతరూపము పోయెను.

9, పాపవినాశనము.

ఈ తీర్థము శ్రీస్వామి పుష్కరిణి కుత్తరభాగమున మూడుమైళ్లదూరమున నున్నది. ఇందలి స్నానము ముక్తి దాయకము.

శ్లో. ————————

తత్రస్నానాన్నరాయాన్తి వైకుంఠం నాత్రసంశయః.

ఈ తీర్థమునకు ముక్కోటి అగు ఆశ్వయుజ శుద్ధసప్తమి ఉత్తరాషాఢా నక్షత్రముతో కూడిన ఆదివారమునాడు గాని, ఉత్తరాభాద్రా నక్షత్రయుక్తమైన ద్వాదశినాడుగాని స్నానముమిగుల శ్రేష్ఠము.

శ్లో. ————————

ఆశ్వయుక్శుక్లపక్షేచసప్తమ్యాంభానువాసరే.

శ్లో. ఉత్తరాషాఢాయుక్తాయాం తథాపాపవినాశనమ్,
ఉత్తరాభాద్రాయుక్తాయాంద్వాదశ్యాంవాసమాగమః॥

శ్లో. సాలగ్రామశిలాందత్వా స్నాత్వాచవిధిపూర్వకమ్,
ముచ్యతేసర్వపాపైశ్చ జన్మకోటిశతోద్భవైః.

## 10. ఘోణతీర్థము.

ఈ తీర్థము శ్రీస్వామి పుష్కరిణి కుత్తరభాగమున పది మైళ్లదూరముననున్నది. ప్రదేశముచూడ బహు రమణీయముగ నుండును. ఇది దట్టమైన అరణ్యమధ్యమున్నది.

మీనమాసములో నుత్తరాఫల్గునీ నక్షత్రయుక్త పౌర్ణమాస్యదినమున నీతీర్థముకోటి. అచ్చట కప్పుడనేక జనంబులేగి స్నాన జపభోజనాదులుగావించి సాయంకాలమునకు తిరుగ వచ్చెదరు. దేవస్థానమునుండి శ్రీవారి కారగింపయిన ప్రసాదములు చందనము తాంబూలము సహా అచ్చటకేగిన జనంబున కాహారమునకు పంపబడును.

శ్లో. — — — .

మీనసంస్థేసవితరిపౌర్ణ మాసీతిథౌధరే

శ్లో. ఉత్తరపల్గునీయుక్తే చతుర్థేకాలసత్తమే,
పంఙ్ఞ్చానామపితీర్థానాం తుమ్బ్రీధగిరిగహ్వరే.

శ్లో. యస్నాతిమనుజోదేవి పునర్గర్భేనజాయతే।

— — — —

ఇక్కాలమునచేసిన స్నానఫలంబు చెప్పనలవిగాదు. కోటికన్యాదానములు గోదానములు మొదలగునవిచేసిన ఫలంబుప్రాప్తించును. సమస్తపాపములను హరించును. ముక్తినిచ్చును. గంగాదినదులలో స్నానంబొనర్చిన పుణ్యంబు సంప్రాప్తించును. అగ్నిష్టోమాది క్రతువులొనర్చిన ఫలంబు జేకూరును. ఆరామచ్ఛేదనము, కన్యావిక్రయము, దేవద్రవ్యా

పహరణము, తటాకుసేతు భేత్తారము. పరస్త్రీసంగలోలు పము, గురు విప్రజనద్వేషము, ఆత్మస్తుతి పరాయ ణము, అసంస్కృతాన్న భోజనము, పితృశేషాన్న భోజనము, మాతాపితృవిరోధము బ్రాహ్మణుండు దర్భపాణియై ఛండా లునితో భాషించుట, పితృయజ్ఞ పరిత్యాగము మొదలగువాని వలన దోషములను ఘోణతీర్థస్నాన ముహరించును, ఇందలిస్నా నము వలనపునరావృత్తి వర్జితమైన వైకుంఠప్రాప్తిగల్గును.

పూర్వకాలములో తుంబురుడను గంధర్వుడు పత్నిసహి తముగ నీతీర్థమువద్దనివసించుచుండెను. తుంబురుడు సర్వవిద్యా విశారదుండు. భార్య సర్వానుగుణసంపన్నురాలు. గంధర్వుడు ప్రీతితో తనభార్యనుబిలిచి ఈమాఘ మాసంబునను దినము. తనతో అరుణోదయమున స్నానము జేసినట్లిల్లు అలికిముగ్గు పెట్టి దేవతానివేదనకు పాకము చక్కగాచేసి తనతో దేవునికి ప్రదక్షిణముగావించి అరిషడ్వర్గంబులు వదలి శ్రీమన్నారాయుని ధ్యానింపుము. శాశ్వతైశ్వర్యపదము సులభసాధ్యమగునని జెప్ప శీతంబున స్నానంబు సాధ్యంబుగాదను అప్రియ వాక్కులనేక ములు బలుకునాగ్రహముగల్గి "శ్లో. పుత్రంచధర్మదిముఖం భార్యాం చాప్రియభాషిణీమ్, అబ్రహ్మణ్యంచరాజానాం సద్య శ్శాపేనశోషయేత్॥"అనువాక్యము స్ఫురణకు తెచ్చుకొని "నీవు ఘోణతీర్థమునకు దక్షిణమున నిర్జలప్రదేశమున పిప్పలివృక్ష కోటరములో మండూకరూపముననుండువుగాక!" అని భార్య నుశపింప నామెపతిఅయిన గంధర్వవల్లభుని పాదములమీదపడి దయకు ప్రార్థింప "అగస్త్య ఋషిశిష్యులతోవచ్చి ఘోణతీర్థ ములో స్నానముగావించి పిప్పలి వృక్షమువద్ద శిష్యులకు

ఘోణతీర్థమహిమ జెప్పనదివిన నీకు ఈ రూపము బోవునని ఆనతిచ్చెను. ఆప్రకారమనేక వత్సరములా కోటరములోనుం డెను. తుదకు అగస్త్య ఋషిశిష్యులసహా వేంకటాద్రికివచ్చి శ్రీస్వామిపుష్కరిణిలో స్నానమాచరించి శ్రీవరాహస్వామివా రిని, శ్రీవేంకటేశ్వరస్వామివారిని దర్శించి ఘోణతీర్థమునకుజని స్నానానంతరము పిప్పలి వృక్షనీడను కూర్చుండి శిష్యులకు ఘోణతీర్థమహాత్మ్యము వర్ణించెను. మండూకము ఋషిపాద కములకు నమస్కరింపనారీరూపము జెందెను. అంత నీవెవ్వర వని నామునిపుంగవుడడుగ పతివాక్యము మీరినందున నీగతి గల్గెనని అంతయు వెల్లడిచేసెను. అంత నామునిశ్రేష్ఠుండు "పతివాక్యంబు మీరరాదు. స్త్రీకి స్వాతంత్రములేదు. పతియె ఆత్మ, విష్ణు, బ్రహ్మ, శివుడు, గురువు, పతిపాదములుకడిగి ఆ తీర్థములో స్నానముచేసిన గంగాదినదులలో స్నానఫలంబుగల్గు టయేగాక శ్రీమహావిష్ణువునకు ప్రీతిగల్గును." అను హితోప దేశముచేసెను. తుంబురునిభార్య శాపముచే మాండూకు రూపాపమొంది ఘోణతీర్థమహాత్మ్యమువలన తిరుగ నారీరూ పముజెందెను. గనుక తుంబుర తీర్థమని పేరుగల్గెను. దీనినే తుంబుర ఘోణతీర్థమని వాడెదరు.

ఇచ్చట తరిగొండ వెంగమ్మను భక్తురాలు కొంత కాలము క్రిందట తపంబుసల్పిన తావు ఇంకను తెల్లంబు.

## 11. రామకృష్ణతీర్థము.

శ్రీస్వామి పుష్కరిణికి ఉత్తరభాగములో నీ తీర్థము 6 మైళ్లదూరమునగలదు. ఇచ్చటకు కృష్ణుడను నొక మునితప స్సుచేసుకొనుచు నీ తీర్థము స్నానార్థము కల్పించెను.

అనంతరము రామకృష్ణుడను నొకముని ఇచ్చట అనేక శతాబ్దములు ఘోరతపంబుసల్పెను. ఆమునిచుట్టు వల్మీకె మొక టినిర్మాణమాయెగాని నామునిపుంగవున కిది తెలియదాయెను. ఇతని తపంబుచూచి పరీక్షార్థమై సప్తదినసంబులు రేయం బగళ్లు దేవతలు అతీతమైన వర్షంబుకురుపించిరి.

శ్లో. ధారావర్షేణమహతా వృష్యమాణోపివైమునిః,
తద్వర్షంప్రతిజగ్రాహ నిమీలితవిలోచనః.

తర్వాత ఉరుములు విశేషముగానుండెను. చెవులు విన బడకనుండెను. మెరుపులు పిడుగులుగల్గె. పిడుగులవలన వల్మీక శిఖరముక్రిందపడెను. వెంటనె గరుడారూఢుడైన శ్రీమహావిష్ణువు ప్రత్యక్షుమై ఇట్లు వచించెను.

శ్లో. మదావిర్భావదివసేయ స్స్నాతిమనుజోత్తమః,
తస్యపుణ్యఫలంవక్తుం శేషేణాపినశక్యతే.

శ్లో. మకరస్థేరవౌవిప్ర పౌర్ణమాస్యాంమహాతిథౌ,
పుష్యనక్షత్రయుక్తాయాం స్నానకాలోవిధీయతే.

శ్లో. తద్దినేస్నాతియోమర్త్యః కృష్ణతీర్థేమహామితిః,
సర్వపాపవినిర్ముక్త స్సర్వాన్కామాలభేతసః.

శ్లో. మదావిర్భావదివసె కృష్ణతీర్థజలేశుభె,
స్నాతుంతత్ర సమాయాంతి స్వపాప పరిశుద్ధయే.

స్కాన్దపురాణము.

నేను నీకు ప్రత్యక్షమయిన దివసమగు మకరమాస పుష్యమి నక్షత్రముతో కూడుకొనిన పౌర్ణమాస్య దివసమున తీర్థములో స్నానముచేయు దేవతలు, మనుష్యులు మొదలగు వారికి సర్వపాపములు పోవును. ఇకమీాదట నీతీర్థము రామ కృష్ణతీర్థమని లోకములో ప్రఖ్యాతిజెందును.

ఈ శుభదినమున వందలకొలది జనులు స్నానమునకు తీర్థమునకువెళ్లెదరు. దేవస్థానమునుండి ప్రసాదములు మొదల గునవి పంపబడును. దేవస్థానం శిబ్బందీలు అర్చకులు మొదలగు వారందరు వెళ్లెదరు. అచ్చటనుండు కృష్ణవిగ్రహమునకు అభి షేకమయి దేవస్థానంనుండి తీసుకొనబడిన ప్రసాదము ఆరగిం పయి వినియోగము జేయబడును.

## అధ్యాయము IX.

ఈ దేవస్థానములో ప్రసిద్ధికెక్కిన విజయనగరపు రాజులైన కృష్ణదేవరాయలు, వీరి ఇద్దఱుభార్యలు, వీరి తమ్ముడు వెంకటపతి రాయలుయొక్క విగ్రహములు (Statues) తోడరు మల్లునిభార్య, మంత్రి, మంత్రిభార్యయొక్క విగ్రహములు (Statues) గలవు. ఇంకను రెండు గలవుగాని ఎవరో తెలియదు.

అక్బర్ చక్రవర్తి మంత్రి తోడర్ మల్లుయు ఇతనిభార్యయు శ్రీ వేంకటేశ్వరస్వామివారి భక్తులనియు, దేవస్థానమునకు మహోపకారము చేసిరనియు వదంతిగాని దృష్టాంతముగా శాసనముల రూపకముగా నింకను నేమియు గానము.

ఈ దేవస్థానము అనాది అనియు శ్రీమహావిష్ణువు శ్రీవైకుంఠమునుండి దయచేసి రనుట పురాణప్రసిద్ధము. చరిత్రకారకులు ఈ దేవస్థానము గురించి ఏమి వ్రాసిరి అను మొదలగు సంగతులు వినుట కాహ్లాదకరముగా నుండును గాన కొంచె మిట వివరించెదను.

మెగస్తనీస్ ఫాహియాన్ మొదలగు కొందఱు ఈ దేవస్థానము గురించి వ్రాయలేదు. కాంచీపురము మొదలగు స్థలముల గురించి వ్రాసి తిరుపతి శ్రీవేంకటేశ్వరస్వామివారి దేవస్థానము గురించి వ్రాయనందున నీదేవస్థానము లేదనిగాదు. వీరు దేశమంతటయు తిరుగుచు వారు చూచినవి, విన్నవి కొన్ని పురములు మొదలగునవి విశేషముగా వర్ణించిరి. ఈ పర్వతమునకు నాల్గు జాతుల హిందువులు తప్ప ఇతరులు వచ్చుటకు వీలులేనందున వారు యిచ్చటకు రాలేదు. వర్ణించను లేదు. అదిగాక పూర్వము

మార్గస్థుల కిది మార్గములోను లేదు. ఈ కారణముల చేత వారికి వర్ణింప నవకాశము గలుగలేదని ఊహించవలసినది.

"మణిమేఖల" అను గ్రంథములో ఈ దేవస్థానము గురించి చెప్పబడినది. ఇది క్రీస్తుశకమునకు రెండవశతాబ్దములో వ్రాయబడిన పుస్తకము.

ద్రవిడ ప్రబంధములో 9 ఆళ్వార్లు శ్రీ వేంకటేశ్వరస్వామివారిని గురించి వర్ణించియున్నారు. అందులో పొయిగాళ్వార్ అనువారు క్రీస్తుశకమునకు అనేక శతాబ్దములకు పూర్వము ముందుండినవారు. వారు తిరుమలగురించి వర్ణించినారు.

తాళ్ శడై యుమ్ నీణ్ముడియుమ్ ఒణ్మళువుమ్ శక్కరముమ్ ।
శూడారవుమ్ పొన్నాణుమ్ తోన్ఱుమాల్ శూడమ్ ।
తిరణ్డరువి పాయుమ్ తిరుమలై మేలెన్దైక్కు ।
ఇరణ్డురువు మొన్నాయిశైన్దు ॥

శివకేశవ చిహ్నాలు గలిగి ఇద్దఱు ఒక్కరయినట్లు వర్ణించినారు. వీరి కాలములో మతద్వేషములు లేక సమ్మతముగా నుండవచ్చునని తోచెడిని.

ఈ దేవస్థానములో ప్రాకారములమీదనున్న శాసనములు పూర్తిగా బహిరంగము చేయుటకు శ్రీ విచారణకర్తల వారయిన శ్రీ మహంతుప్రయాగ్ దాస్‌జీవారి వుత్తరవు ప్రకారము క్రీస్తుశకము 1922-వ సంవత్సరములో ఇట్టి శాసనములు ప్రచురమున కొకశాఖ నిర్మాణము చేసినందువలన నా శాఖవారు శాసనంబులు పరీక్షించి వ్రాయుచున్నారు. పూర్తి

అస్ఫుటకు కొన్నివత్సరంబులు పట్టును. అయినను దొరికినంత వరక్కున్న శాసనంబులవలన నీ దేవస్థానమునకు చోలపాండ్య రాజులు కైంకర్యములు చేసినట్లు తెల్లంబు.

9. 1. 61 of 1889. (అర్వము) మొదట ప్రాకారములో నుత్తరపుగోడమీద కోనీర రాజరాజన రేంద్రవర్మన్ యొక్క 16-వ వత్సరము లోనిది.

డాక్టర్ హుల్టిశిస్కు అనువారు ఈ శాసనమున్ను, తర్వాత రెండుశాసనములున్ను నవీనమనియు, ఈ దేవస్థానమును జీర్ణోద్ధారముచేసిన సాలువవంశపు రాజయిన వీరనరసింహదేవరాయుని కాలములో పూర్వమున్నచోల శాసనములకు తప్పు ప్రతి అని అభిప్రాయ మిచ్చిరి.

9. J. 62 of 1889. (అర్వము) మొదటి ప్రాకారము త్తరపు గోడమీద కోప్రపత్ర మహేంద్రవరనుయొక్క 14-వ వత్సరములోని శాసనము.

9 K. 63 of 1889. (అర్వము) మొదటిప్రాకార ముత్తరపు గోడమీద కోపరత్నవరంయొక్క 14-వ సంవత్సరములోని శాసనము.

9 L. 64 of 1889. (అర్వము) రాజరాజేంద్ర చోల దేవుని కాలములోని శాసనము.

17. 256 of 1904 చోలవంశములో నొకరాజు గురించి శాసనము.

19. C. 713 of 1904 (అర్వము) చోలవంశపు రాజయిన కుళోత్తుంగ I గురించి శాసనము.

19 B 712 of 1904 (అర్వము) పాండ్యరాజయిన జటవర్మన్ సుందరపాండ్య I గుఱించిన శాసనము. వత్సరము అగుపడలేదు.

19 D 174 of 1904 (అర్వము) యాదవరాయ వీరనరశింహాదేవునినిగురించి శాసనము. వత్సరముసరిగా అగుపడలేదు.

9 S 71 of 1889 (అర్వము) త్రిభువనచక్రవర్తి శ్రీ వీరనరశింహ దేవయాదవరాయుని గుఱించి శాసనము.

పూర్వపుచరిత్రలు తెలిసినంతవరకు క్రీస్తుశకము ౯-వ శతాబ్దపుంత్యమువరకు కాంచీపురము రాజధానిగా పల్లవవంశస్థులు ఉత్తరార్కాట్ జిల్లా పాలించిరనియు తర్వాత ఉరయూర్ చోలవంశస్థులు మాల్కా హెడ్ రాష్ట్రకూటవంశస్థులు,తంజావూరులో గొప్ప చోలరాజయిన రాజరాజదేవుడు, తుదకు విజయనగరం హిందూరాజులు పాలించిరని ఇంపీరియల్ గెజటీరు అయిదవ భాగము (Volume) లోనున్నందున నీదేవస్థానము వీరందఱిపాలనలో నుండెననిచెప్పుటకు సందియము లేదు. పురాణరీత్యా అనాది అని చెప్పబడు శ్రీవేంకటేశ్వర స్వామివారి దేవస్థానముయొక్క కాలనిర్ణయము చేయుటకు చరిత్రలు పూర్ణమైన సహాయంబింకను నొసంగవు. అయినను క్రీస్తు శకమునకు చాలాపూర్వమనియు కాలనిర్ణయంబు సరిగాచేయుటకింకను అవకాశము గలుగలేదనియు రూఢిగ చెప్పవచ్చును.

సాలువ వంశము.

విజయనగరములో శివభక్తులైన సంగమవంశీకులు పాలనానంతరము సాలువవంశీకులువచ్చిరి. వీరువిష్ణుభక్తులు వరా

హము, బాకు, రాజచిహ్నాలుగా గలవారు. ఈవంశములో మొదటిరాజు వీరనరశింగరాయులు. ఈయన 1490-వ వత్సరములో రాజ్యమునకు వచ్చెను. ఈయన సంగమవంశకులలో నాఖీరురాజువద్ద సేవకుడుగానుండి మోసకృత్యమువలన రాజ్యము సంపాదించెను. శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవస్థానమును జీర్ణోద్ధారము చేసెను. ఈరాజు జీర్ణోద్ధారము చేసినట్లు దేవస్థానము ప్రాకారపు గోడమీద శాసనముగలదు. ఈయనచేయు జీర్ణోద్ధారములో పూర్వమువలె నెచ్చోటనుండు రాళ్లనచ్చోట సరిగా నుంచకపోవు ప్రాచీన శాసనంబులు నులభ్యంబులుగావయ్యె. గుడిప్రాకారముల మీదను, బంగారు మలాంచేయబడిన రాగిరేకుతో నాచ్ఛాదనంబయిన కట్టుగల భావిమీదను సహా "వరాహము, బాకు" చిహ్నాలు గల్గియున్నవి. వీరు ద్రావిడ దేశమునుకూడ కొంత లోబర్చుకొని చంద్రగిరివేలూరు పురములలో కోటలుగట్టిరి. వీరు శ్రీ వేంక శ్వర స్వామివార్కి అయిదు గ్రామములు ఇచ్చినట్లు దిగువనుదహరింపబడు శాసనంబువలన ఏర్పడును.

11 250 of 1904 (అర్వము) శాలివాహన శతము 1389 సర్వజిత్ సంవత్సరములో గుండయ్యదేవ మహారాజు కుమారుడు సాలువరాజయిన నరశింగయ్యదేవ మహారాజు ఉడయరు దేవస్థానమునకు అయిదు గ్రామములిచ్చినట్లు మొదటి ప్రాకారము దక్షిణపుగోడమీద శాసనముగలదు.

ఇంకొక శాసనము అనగా 10 249 of 1904 అర్వభాషలో శాలివాహనశకము 1385 స్వభాను వత్సరములో నరసింగరాయ ఉడయర్ యొక్క ఈవినిగురించి విస్తరించిచెప్పుచున్నది.

ఈ శాలువవంశీకులు ఈదేవస్థానమునకు విశేషముగా గ్రామములు, భూములు, తిర్వాభరణములొసగిరి. గుడిగోపురాదులు జీర్ణోద్ధారము చేసిరి. ఇంకను అనేకవిధముల వృద్ధిచేసిరి. వీరు క్రీస్తుశకము 1493 లో స్మృతినొందిరి.

వీరి తర్వాత ఈయన కుమారుడు వీరనరసింహా దేవరాయులు రాజ్యమునకు వచ్చిరి. వీరును దేవస్థానమునకు తిర్వాభరణము మొదలగునవొసగిరి.

తుళువ వంశము.

వీరితర్వాత ఈయనతమ్ముడగు క్రిష్ణదేవరాయలు రాజ్యభారంబువహించి ద్రవిడదేశమంతయు వశపరచుకొనిరి. వీరి కాలములో విజయనగరరాజ్యం ఔన్నత్యదశనొందెను. వీరి యొక్కయు భార్యలయినచిన్నాదేవి తిరుమలదేవి యొక్కయు విగ్రహములు (Statues)పడికావలిలోపల మంటపములోగలవు.

వీరిని గురించి ఈ దేవస్థానములో అనేక శాసనములు గలవు. వీరు ప్రతాపరుద్ర గజపతిని కొండవీడు వరకు తరిమినట్లును ఉదయగిరి ముట్టడించినట్లును శాసనము గలదు. (Vide 9 A 52 of 1889) వీరు శాలివాహనశకము 1436 భావ సంవత్సరములో చనిపోయినట్లు అనేక శాసనములు గలవు గాని మొగటి ప్రాకార పుత్తరగోడమీద శాలివాహన శకము 1434 ఆంగీరస వత్సరములో పరమపద మొందినట్లును, వారి భార్యలు చిన్నాదేవి, తిరుమలదేవి దేవస్థానమునకు తిర్వాభరణములొసగినట్లును శాసనములు గలవు.

రవి ఉడిథారకటారి వరకుచ్ఛుసహా నచ్చకం ఉడిథార నిచ్చకం కటారివరచిన్న కఠారివరపతకం భుజకీర్తిజతలు 3 చిన్న

కిరీటములు శ్రీకృష్ణదేవరాయులు శా॥ 1435 శ్రీముఖనామ శాఖ బహుళ ద్వాదశీ సోమవారంనాడు శ్రీవేంకటేశ్వర స్వామివారికి సమర్పించిరి. శ్రీవారికి ప్రస్తుతం సమర్పణలోనుండు కఠారి శ్రీకృష్ణదేవరాయులు సమర్పించిరను వదంతి ఈశాసనంబువలన నిజమని ఏర్పడుచున్నది. శా॥ 1434 అంగీరస ఫాల్గుణ శుద్ధ పంచమినాడు నవరత్నఖచితమైన 3308 తూకాలుగల బంగారు కిరీటము శ్రీస్వామివారికి సమర్పించిరి. ఇదే తేదిలో వీరిభార్యలు తిరుమలదేవి, చిన్నాదేవి జిలిపాల అవసర నైవేద్యమునకు పయిండిగిన్నెలు 1కి 374 తూకములుగలవి సమర్పించిరి. దేవస్థానమునకేగాక బ్రాహ్మణులకు విద్వాంసులకు గ్రామాదులు శ్రీకృష్ణదేవరాయ లొసగిరి. తిరుపతిలో తూపల్ దీక్షితులకు శిరిపాది గ్రామంలో మాధవకాల్వ నొసంగెను. తాళపాకం తిరుమలయ్యకు అనేక గ్రామాదుల నిచ్చిరి. శ్రీవేంకటేశ్వర స్వామివారి కర్పించిన తిరువాభరణములు మొదలగునవి లెక్క లేదు. ఈక్రింద వివరించిన శాసనంబువలన శ్రీవారికీవారు కనకాభిషేకంబు చేసినట్లు తెలియుచున్నది.

"శా ౧౪౩౬ భావసంవత్సర ఆషాఢ శుద్ధపౌర్ణమి గురువారం శ్రీమద్ మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీర ప్రతాప రుద్రగజపతిమీాదను దండువిచ్చేసి ప్రతాపరుద్రగజపతిని కొండవీటి దనకాను విరుగంబొడిచి ఉదయగిరి దుర్గమున్ను కైకొనితిరిగి విజయనగర రాజధానికి విచ్చేస్తున్నూ తిరుమలమీాదికి విచ్చేసి తిరువేంగళనాథ దేవునికి కనకాభిషేకంచేసిన రొఖ్ఖం వరహాలు X 30000 ఇవే అక్షరాలాము ప్పై వేలు"

ప్రతాపరుద్ర గజపతిని ఓడించినతర్వాత గజపతియొక్క కుమార్తెను వివాహముచేసు కొనినట్టు చెప్పెదరుగాని ఆరాణి యొక్క ప్రశంస ఇంకను గనపడలేదు.

వీరితర్వాత అచ్యుతరాయులు పాలించిరి వీరికితిరుపతిలో పట్టాభిషేక మహోత్సవ మయినది. త్రిభువనచక్రవర్తి తిరువేంగడ యాదవరాజు తిరుపతిని సర్వమాన్యముగా శ్రీవేంకటేశ్వర స్వామివారికి సమర్పించినందున అచ్యుతరాయుల కాలముననే తిరుపతి దేవమాన్యముగా నుండెను. అచ్యుతరాయులు శ్రీవారికి గ్రామాదులు తిరువాభరణములు మొదలగునవి విశేషముగా అర్పించిరి. హిందూరాజులు శ్రీవారికి ఏర్పాటుచేసిన నివేదనలు ఉత్సవములు వర్ణింపనలవికాదు. శా 14౹6 జయ సంవత్సర మేషమాస బహుళసప్తమీ ఆదివారం ఉత్తరాషాఢనక్షత్రమందు అచ్యుతరాయులు పట్టమహాదేవి వరదాదేవి శ్రీవారినివేదన ఖర్చులకుగాను గండికోట సీమలోని చిన్నమడుపులూరు, ముత్తుకూరు కొండవీటి సీమలోని పాలివా, వల్లి, మంగమూరు, నారాయణపురపట్టులో పైండపల్లి, గ్రామములు ఆరింటిని సమర్పించెను. శా 1454 నందనసంవత్సర వృషభ మాస బహుళ ఏకాదశి సోమవారం ఉత్తరాభాద్రా నక్షత్ర యుక్తశాసనములో కొండమీద ఆడినుంచి చిత్తివర్కు 7 బ్రహ్మోత్సవములు తిరుపతిలో వైయ్యాశిలో 1 ఆనిలో 1 రెండు బ్రహ్మోత్సవములున్నట్టు ఏర్పడుచున్నది.

ప్రస్తుతం కొండమీద ఒక బ్రహ్మోత్సవము ప్రతివత్సరము జరుగుచున్నది.అయితే చాంద్రమాన రీత్యా అధికమాస మువచ్చినప్పుడు మాత్రము రెండవ బ్రహ్మోత్సవము జరుగును.

యోచించగా ఏడు బ్రహ్మోత్సవము లున్నట్లు శాసనమువల్ల తప్పఆచారమువల్ల ఇప్పుడు అగుపడదు. గాని ఇంచుక శ్రద్ధతో పరిశీలించినంతట కొంతవరకు ఫలానా మాసములలో బ్రహ్మోత్సవములు జరుగుచుండెనని తెలియగలదు. అనంతపద్మనాభ చతుర్దశినాడు ముక్కోటిద్వాదశినాడు రథసప్తమినాడు శ్రీస్వామి పుష్కరిణిలో చక్రస్నానము జరుగు అచారముగలదు ఈ చక్రస్నానమునకు కారణమేమని అనేక వత్సరములు ఎవరిని అడిగినను సరి అయిన సమాధానము రాదాయెను. ఈ శాసనమువల్ల బ్రహ్మోత్సవము పూర్తిఅయిన తర్వాత చక్రస్నానమని నేను ఎంచితిని నేను నాయోచన సరియని పల్లవ వంశీకుడయిన కోపార్థివేంద్రవర్మణ కాలములోనే శాసనమువలన ఏర్పడినది. ఆవర్మణ తమ 14-వ వత్సరపు పాలనములో శ్రీవారికి ధనుర్మాసములో ముక్కోటి ద్వాదశికి ముందుదినమునకు 2 బ్రహ్మోత్సవములు 7 దినములు జరుగునట్లు నియమించి అందుకు 4760కి గుంటలభూమిని ఏర్పాటుచేసిరి. కాలక్రమేణ హిందూ రాజుల పరిపాలనంబు పోయిన తర్వాత కొన్ని బ్రహ్మోత్సవములకు చక్రస్నానంబుమాత్రము మిగిలెను మరికొన్ని బ్రహ్మోత్సవములు రూపులేకపోయెను. రథసప్తమి ముందు బ్రహ్మోత్సవముమాత్రము 7 ఉత్సవములు చక్రస్నానము ఒకే రోజు జరుగునట్లు ఏర్పడెను.

పూర్వముబ్రహ్మోత్సవానంతరము వడాయతి వుత్సవము గుచున్నట్లు శా1314 అంగీరససంవత్సర శాశనమువలన నందవనములోపూామంటపమునకు శ్రీవార్లు విజయముచేసినట్లు ఏర్పడు

చున్నది. నందవనములందలి అనేకమంటపములు చూడనాకు గల్గిన సందేహము ఈశాసనంబువలన నివృత్తిగల్గెను.

హిందూరాజుల కాలములో శ్రీవారికిని వేదనలపరిమిత ముగానుండె నని ఇదివరలోనే చెప్పబడెనుగదా! ఇంతనివేదన యు ఇప్పటివలెనేశ్రీవారికిప్రతినిత్యము నియమిత కాలములయిన పగలు 2సార్లు రాత్రి 2సార్లునివేదనఅగుచుండెనా? లేక ఇంకను హెచ్చుసార్లునివేదనఅగుచుండెనా? అనిదేవస్థానపుఅనుభవముగ లవారికి ఈసందేహముకలుగకమానదు. పూర్వము "అచ్యుత రాయులసంధి"అనికొన్నిగంగాళములునివేదన ప్రతినిత్యముగల దు. ఇదేమాదిరిగా అనేకరాజులపేర్లలోఅనేకగంగాళములునివే దనగలవు. సంధిఅనగానేమి? ఇప్పుడు రెండవఘంటకునివేదన అ య్యేస్వల్పమైనచప్పిడి ప్రసాదము సంధి అనివాడబడుచున్నది.బ్ర హ్మోత్సవములుపొయి చక్రస్నానముమాత్రము మిగిలినట్లు సంధి అని కొంచముచప్పిడిప్రసాదము ఆరగింపు మాత్రము నిలిచినది. సంధి అనగా రెండుకాలములుకూడు సమయము ఇక్కడ సేవ లకుమధ్యకాలమునకు సంధి అని చెప్పవచ్చును. ఆసంధి సమయ ములోఆరగింపు అయ్యేప్రసాదములకు సంధి ప్రసాదము అనిచె ప్పుటకుబదులు సూక్ష్మముగా ఏరాజుసమర్పించిన ప్రసాదములు ఆ రాజు యొక్క సంధి అని పూర్వులువాడినట్లున్నది. విశ్వరూప దర్శనమైనతర్వాత తోమాలసేవకు ప్రారంభముచేయబోవుకా లము, తోమాల శేవఅయికొల్వుకుముందు కాలము, కొల్వుఅయి అర్చనకుముందు కాలము, మధ్యాహ్నము ధర్మదర్శనముఅయి అర్చనకుప్రారంభించబోవుకాలము, సాయంకాలముతలుపులుతీ సిరాత్రితోమాల శేవకుముందుకాలము, తోమాలసేవ అయి అ

ర్పనకుముందు కాలము, రాత్రి దర్శనమై ఏకాంతసేవప్రారంభించ బోవుకాలము సంధికాలములుగానుండును. ఈసంధి కాలముల యందుప్రసాదములు శ్రీవారికిఆరగింప గుటవలన ప్రసాదములు చేయువారికి కష్టమతీతము లేకపోవుటయేగాక ప్రసాదములు భోగ్యముగానుండి కాలాకాలములందు భక్తాదులుస్వీకరించుటకు ప్రయుక్తములుగానుండును. ఇట్లునివేదనచేయుట గలదనుటకు తోమాలసేవకుముందు ప్రసాదములు ఆరగింపయినట్లు శాస నంబువలనఏర్పడును. శ 1390 సర్వధారిలో కందాడై రామాను జయ్యంగార్ నరియనూరిసరిహద్దు మొదలు కుంద్రపాకము పరిత్తి పుత్తూరుగ్రామముల మీాఁగుగా దేవమాన్యమగు తిరువేంగడనె ల్లూరులోనిభూములకు నీరుపారుటకు కాల్వత్రవ్వించి ఆభూమిఫలి తమువల్లను దేవమాన్యమగు కొనిపట్టు దక్షిణపుతెట్టు భూముల కునీరుపారునట్లుకాలువత్రవ్వించి ఆభూములఫలసాయము చేతను తోమాలసేవకు(శ్రీవారిపాదాబ్జములుకడిగిన సమయమున) 4౯౦ గాళములదధ్యోదనము శ్రీవారికిఆరగింపుచేయుటకుఏర్పాటు చేసి రిఇదిగాకఇంకొక శాసనమందు శ్రవణనక్షత్రమందు శ్రీవారలకుతి రుమంజనమైనవెంటనే అన్నప్రసాదములు ఆరగింపయినట్లు తెలి యగలదు శ్రీవారికై వ్యోడిని వేదనలలో ఇడ్డెనలు కూడాపూ ర్వము ఉండినట్లు శా 1441 ప్రమాది వత్సరపు శాసనమువలన తెలియగలదు.

అచ్యుతరాయలు తర్వాత కొంతకాలమునకు రామరాజు పాలించెను. అప్పుడును వీరు భక్తితో దేవస్థానమును పాలించిరి. తులువవంశస్థులకాలములో తిరుపతిఘాటలు బాగుచేసి యాత్రికుల కుసురక్షితముగాపోవునట్లును, యాత్రికులకుపయుక్తముగడోలీలు

గురించిగూడ సౌకర్యార్థముగా ఏర్పాటు లున్నట్టు చెప్పుతారు. తదనుగుణముగా ఆంధ్రసాహిత్య పరిషత్ యొక్క కాళయుక్తి సంవత్సరము మాఘ ఫాల్గుణ మాసముల సంచికలో 428-వ పేజిలో ప్రకటింపబడిన చింతరాజుపల్లె పాళెం వెంకటపతిరాయనివద్దనున్న కాగితపు కౌలుకు నకలువల్లను తెలియగలదు.

"స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ౧౪౪౮ అగు నేటి వ్యయనామ సంవత్సర వైశాఖ ౧౫లు శ్రీమద్రాజాధి రాజరాజ కంఠీవర రాజకందర్ప మహారాజాధిరాజ పరమేశ్వర రాజపూజితులగు మహారాజశ్రీ రామరాజయ్యగారు విజయనగర సింహాసనమున పృధ్వీసామ్రాజ్యము చేయుచుండగాను గురుగింజకూటన మలసేని కుమార పెద్దబుచ్చినాయనవారికి వ్రాయించియిచ్చిన కౌలునీరుపం. మహారాజశ్రీ కృష్ణరాయలయ్య గారికిన్ని తరిగొండ తిమ్మానాయని కుమార రామానాయనికిన్ని విరోధం సంభవించినప్పుడు మీరు వారిలో కిలస్తిరి అని సంశయించి మీకు నడుస్తువున్న గ్రామాదులు నశీర జప్తిచేయించిరి గనుక కోటకొండ పెద్దవ్రాజుళ రాజు విప్పవెంట కుమార జంగమరెడ్డి కడప గోపాల బుద్ధారెడ్డి వ్రాగిమళ్ల పెద్దరెడ్డి పీరబల్లె యరమాచిరెడ్డి గెందికోట బాగసాని పెద్దనల్లపరెడ్డి యీ మొదలయిన దేశస్థులున్ను మహారాజశ్రీ రాయలవారి ముద్రకర్త వుదయగిరి మలహరి శంకరపంతులు కొమారుడు ఆనంద గోపాలపంతులువారు మాతో విన్నపం చేసిరి. గనుక చిత్తగించి మీకు నడుస్తూవున్న గ్రామాదులు విప్ప వెంటలోకి చెల్లె ఆరు గ్రామాదులున్ను విప్పవెంట ౧ పాలశమాళ్ల ౧ విరువల్లె ౧ సోమవరం పెద్దనీడు ౧

కొండికోట ౧ చింతరాజుపాళెం ౧ మలసేనిపట్టం ౧ యీ పద్ధాలుగు గ్రామాదులున్నూ మొఖా చేన్నూరు పర్గణే శిద్దవటం తాలూకు యెనబై నాలుగు గ్రామాదులు కావల నిర్వయం. కాగ్రమగుంటకుఁ ౨ మదకకుఁ ౨ దుగ్గానకుఁ ౨ నత్రకుల యిండ్లకుఁ ౨ మడి అనిని ఆధాన్యం చెన్నూరు తాలూకు ౧౪ గ్రామాదులు శిద్దవటం తాలూకు దర అన్ని గ్రామానకు ... ... ... మది సూర్యకోమారుని కనమ రుసుము చేరి కట్టిన రుసుము ... దొంగలసాని రుసం ... తిరుపతిబాట రుసం ... పరపల్లె వంగిమాళ్ల నీటి రుసుములు తొక్కాల పెరికెమర్ ౦/౦ రసవుపూటానకు నగకుర్ ౦/౦ వస్త్రాలనగకుర్ 0/2 తిరుపతి పరుషకు స్వారికి నెర జనం ౧-కి నెబులు ౧ భూసాన్కుర్,=యీ చొప్పున నడిపించుక మాకాలు నమ్మి సుఖాన వుండమని వ్రాయించి యిచ్చిన కవులు నిరుపం.''

ఈ వంశములోని వెంకటపతి రాయలుయొక్క విగ్రహముకూడా (Statue) పడి కావలిలోపల గలదు. వీరు శాలివాహన శకము 1524-వ వత్సరములో శ్రీ వేంకటేశ్వరస్వామివారి దర్శనమునకు వచ్చినప్పుడు మంగలం అను గ్రామము దేవునికిచ్చెను. ఇంకొక శాసనములో శాలివాహనశక 1508 లో వెంకటపతి దేవమహారాయలు శ్రీ వేంకటేశ్వరస్వామివారి సన్నిధిలో గంజివరపట్టు అనుగ్రామము యొసగిరని గలదు.

1566-వ వత్సరములో రామరాజుతల్లి కోటయుద్ధములో ఓడింపబడిన తర్వాత క్రీస్తుశకము 1354-వ వత్సరములో కట్టబడినకోటగల పెనుగొండ రాజధానిగా నేర్పాటుచేసుకొనిబడెను. అనంతరము 1575-వ వత్సరములో తిమ్మరాజు పెనుకొండ

నుండి చంద్రగిరికి రాజధానిని మార్చెను. వీరికాలములోనే ఘంటామంటపములు కట్టించెరని వదంతి. వీరుమిగుల భక్తులు. శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవస్థానములో ప్రతిదినము రెండు బగళ్లు నివేదనకాలములో పెద్దఘంటలు వాయించెదరు. ఆని నాదము 3 మైళ్లు వినబడును. దేవస్థానమునకు 3 మైళ్లదూరములో నొకమంటపం ఘంటయు వీరు కట్టించినారు. దేవస్థానములో నివేదనఘంటకాగానే యీఘంట వాయించబడుచుండెను. ఆనినాదము చంద్రగిరికోటకుచేరగా అచ్చట దేవతా నివేదనయు తాను భుజించుచుండెనని చెప్పెదరు. వీరి పుత్రులలో నొకరు శ్రీహత్తిరాంజీ వారికి శిష్యులయి శ్రీమహాంతు గిరిధరదాస్ జీనామమున శ్రీహత్తీరాంజి మఠమునకు మూలపురుషుని తర్వాత మహాంతుగా నుండెను.

శ్రీరంగరాయ II పరిపాలనలో శా॥ 1499 సేవప్ప కుమారు డచ్చుతప్పనాయక్ (తంజావూరు) వల్ల ఈదేవస్థానము మరమ్మతు చేయబడినట్లు తెలియఁ గలదు. పూర్వము పల్లవవంశీకుడైన కోపార్థివేంద్ర వర్మ తమయొక్క 14 వత్సరపు పాలనంబులో చాలా వ్యయముచేసి శ్రీవేంకటేశ్వర స్వామివారి గర్భగృహమును నూతనముగా కట్టించిరి. తర్వాత త్రిభువన చక్రవర్తి వీరనరసింహ్మ యాదవరాయుల కాలములో దేవస్థానము చాలాభాగము నూతనముగా కట్టబడినది.

ఈ విజయనగరపు వంశములో ఆఖరు రాజయిన శ్రీరంగ రాయులు 1646 క్రీస్తు॥శ॥ చంద్రగిరిలో పాలించెను వీరికినామ మాత్రములోబడిన సామంతరాజులుగా తంజావూరు, మధుర, చన్నపట్నం, శ్రీరంగపట్నము రాజులుండిరి. వీరు 1660-వ వత్సర

ములో పులికట్ వద్దప్రముఖులుగానుండిన డచ్చివారు వలదని నను వినక ఈస్టిండియా కంపెనివారికి మద్రాసు నొసగిరి. నీరు భక్తిశ్రద్ధలతో దేవస్థానమును పరిపాలించినట్లు చెప్పుతారు.

క్రీస్తుశకము 1644 లో బిజపూరుసుల్తానులు కర్నాటక మును దండెత్తుటకు రందూల్ ఖాన్, షహాజి, అను ఇరువురు సేనానులను బంప వారు చంద్రగిరి, గింజిలను లోబరుచుకొనగ శ్రీ రంగరాయలుత్తర కర్నాటములో కొంతకాలము దాగి తుదకు 1646-వ వత్సరములో బెద్నూరుకు, బోయి సామంత రాజయిన బెద్నూరు ప్రభువువద్ద దాగెను. ఈరాజుతో ప్రసిద్ధి కెక్కిన విజయనగరపు వంశస్థుల పాలనంబంత్యమేగాక హిందూ రాజుల పరిపాలనంబు బోయిమహమ్మదీయుల పాలనంబునకు దేశములోనై అందువలన శ్రీ వేంకటేశ్వరస్వామి వారి దేవ స్థానంబు తదాదిగా మహమ్మదీయుల పాలనాధీనంబాయెను.

### మహమ్మదీయ ప్రభుత్వము.

క్రీస్తుశకము 1646 మొదలు బిజపూరు సుల్తానులుపాలించిరి.అనంతరం ఢిల్లీఫాదుషా ఔరంగజీబుదక్షిణదేశము దండెత్తి లోబర్చుకొని తంజావూరు, తిరుచునాపల్లి, మైసూరు, వగైరా సామంతరాజ్యములకుపైన ఆర్కాడులో ఒక్కనొకరునుంచి పాలింప నాజ్ఞాపించి ఢిల్లీకి విచ్చేసిరి. వీరికే ఆర్కాడు నవాబు అనిపేరు. 1732 లో ఆర్కాడునవాబుగా రాజ్యమునకు వచ్చిన దోస్తుఅల్లీకాలములో కలతలు ప్రారంభమాయెను. వీరికాలము లోనే మహారాష్ట్ర రాజయిన రఘోజీభాన్సులే కర్నాటక రాజ్యముమీద దండెత్తి దామల్ చెరువు యుద్ధములో 1740 లో నవాబులను ఓడించి కొంత దేశము దోచుకొని పదిలక్షల రూప్య

ములు తీసుకొని రాజ్యమువదలెను. ఇట్లు పోతూరఫోజీఖాను లే శ్రీవేంకటేశ్వరస్వామివారికి విశేషనగలు సమర్పించిరను వదంతి. వారుసమర్పించిన నగలు యింకను భద్రముగా నుంచబడి శ్రీవారికి సమర్పణ అగుచున్నవి. ఈనవాబువంశములో గృహకలతలు కలిగి ఒకరిని ఒకరు చంపుకొనిన తర్వాత, సైదు మహామ్మదల్లీఖాన్ అనుపసివాడు నవాబుగా నిర్ణింపబడి వందవాసికోటలో పెరుగుచుండెను. అంత ఢిల్లీపాదుషాక్రింద సుబాదార్ (గవర్నరు) గాహైద్రాబాదులో నుండిన నైజాముల్ముల్క్ అనువారు ఆర్కాడుకువచ్చి రాజ్యము అరాచకముగా నుండుటగని మైనరునవాబును ఆర్కాడులో తన నౌకర్లసంరక్షణలోనునచి హైద్రాబాదుకుపోయి ఏలూరు, రాజమహేంద్రవరము,పరగణాలు పాలించుచుండిన తననౌకరైన అన్వారుద్దీన్ఖాని నవాబు పనిచూచుటకు నియమించిరి మైనర్నవాబును వీరి స్వాధీనములో మంచెను. కొలదికాలములోనే మైనర్ నవాబు కొందరు నౌకర్లవల్ల చంపబడగా అన్వారుద్దీన్ఖాన్, నైజాముల్ముల్క్వల్ల నవాబుగా నియమింప బడెను. యిత డికెన్నీపూర్వపు నవాబువంశమునకు సంబంధపడిన ముఖ్యోద్యోగులలో నొకరుగా నుండిన చందా సాహేబునకు కలతలుకలిగెను. 1749లో జరిగిన ఆంబూరు యుద్ధములో అన్వారుద్దీన్ వీరి పెద్దకుమారుడు మఫ్ఫూజుఖాన్ ఇరువరులు చంపబడగా, రెండకుమారుడైన మహామ్మదలీ, తిరుచునాపల్లికి పారిపోయి ఇంగ్లీషువారి సహాయము కోరెను. ఫ్రెంచివారు చందాసాహేబుకు సహాయము గావించుచుండిరి. ఇట్లుండగా హైద్రాబాదులో 104 వత్సరముల వయస్సుగల నైజాముల్ ముల్క్ చని

పోయెను. వారియిష్టానుసారము మనుమడు సుబాకు రావలసి నందుకు నాజర్‌జంగ్ అను కుమారుడు సుబాకు రాగా కల తలు ఆరంభమాయెను. మనుమడు ముర్జషాజంగ్ చందా సాహేబుకు సహాయమొనర్చి అతనిని నవాబుగ నిర్మించెను. నాజర్‌జంగ్ మహమ్మదల్లీని నవాబు అనెను. ఇంగ్లీషువారి సహా యమువల్ల అనేక యుద్ధములైన తర్వాత మహమ్మదల్లీ నవాబు ఆయెను. యుద్ధములో ఇంగ్లీషు సేనాని క్లైవు సహాయమువల్ల నాలుగులక్షలవరహాలు రాబడివచ్చు రాజ్యము (అనగా శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవస్థానము రాబడి సహా) మహమ్మ దల్లీకి లోబడినది. కర్నాటకయుద్ధములు నిల్చినిల్చి జరుగుచుం డెను. 1753 లో మహమ్మద్ కోమాల్ అనుసేనాని ఆర్కా డులో కలతలవల్ల కావేరిపాకం యుద్ధమయినతర్వాత స్వతం త్రము వహించి నెల్లూరు ముట్టడించి స్వాధీనము చేసికొనిరి. నెల్లూరులో గవర్నరును నవాబు సవతి సహోదరుడును అయిన నజీబుల్లా నెల్లూరునుండి ఆర్కాడుకు పారిపోయిరి. ఈప్రకా రము సుమారు ఒకవత్సరము మహమ్మదుకోమల్ జయం బొంది ఆర్కాడుకు యాభైమైళ్ల దూరమునన్నున్న తిరుపతి కొండమీది ప్రసిద్ధికెక్కిన శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవస్థాన మును, ముట్టడింప ప్రయత్నించి వచ్చెను. అప్పుడు వుత్సవాపడి తరాదులు పోను వర్షమునకు 60 వేల వరహాలు ఆర్కాడునవా బులకు దేవస్థానమునుండి రాబడి వచ్చుచుండెను. ఈ దేవస్థా నమువల్ల వచ్చు రాబడిని కర్నాటక యుద్ధములో అయిన ఖర్చులకుగాను నవాబు మహమ్మదల్లీ 1753లో ఇంగ్లీషువారికి

యొసగెను. తదాదిగా రాబడిమాత్రము ఇంగ్లీషువారికి చేరు చుండెను. 1753 లో బ్రహ్మోత్సవమునకు ముందు ఈ దేవ స్థానము స్వాధీనము చేసుకొన నిర్ణయించి తిరుపతికి వచ్చిన మహమ్మద్ కోమాల్ ఇంగ్లీషు సేనానీ ఓగిల్‌బి మహమ్మదు సేనానీ జీబుల్లాఖాన్. వీ రిరువర్ల వల్ల ఓడింపబడినందున దేవ స్థానపు రాబడికి చలనము కలుగలేదు.

1757 లో అత్యాప్తిచెందిన నజీబుల్లాఖాన్ బ్రహ్మో త్సవమునకు వచ్చు యాత్రీకుల నుత్సవమునకు రాకుండ తన రాజ్యమైన నెల్లూరు మండలమునుండి వెనుకకు తరిమినందున బ్రహ్మోత్సవమునకు రాబడి తగ్గెను.

175౻ లో నవాబు సహోదరుడైన అబ్దుల్ వహాబ్ ఖాన్ పాలేరునదికి ఉత్తరముగానున్న రాజ్యమునకు గవర్న రుగానుండి రాజ్యమందలి సొమ్ము వృథా ఖర్చుపెట్టి ధనములేక నుండెను. తిరుపతి దేవస్థానమును ముట్టడించుటకు సేనను చేర్చుచుండెనుగాని ఇంగ్లీషువారు సేనను పంపుచున్నారను వదంతిని విని ఆయత్నమును మాని చంద్రగిరి నాక్రమించెను. హైద్రాబాదునుండి ఫ్రెంచి సేనాని బుస్సి వచ్చుచు తిరు పతిలో మకాము చేసెను. నజీబుల్లాఖాన్‌తో ఫ్రెంచినాయకు డగు మరోసిసీ నెల్లూరునుండి వచ్చి కలుసుకొనెను. చంద్రగిరిలో నుండిన అబ్దుల్ వహాబుకూడ చేరిరి. దేవస్థానపు యిజారా దారును ముట్టడించి దేవస్థానం సొమ్మును తీసుకొనిరి. దేవ స్థానం తమ స్వాధీనము కాదని తెలుసుకొని అబ్దుల్ వహాబ్ వెషలి క్రమేణ ఇంగ్లీషువారి స్నేహము చేసెను. ఫ్రెంచివారు దేవస్థానపు యిజారాదార్ వద్దనుండి లక్షరూపాయలు తీసి

కొని ఇంగ్లీషువారికి వ్రాసియిచ్చిన రీతిగా కవులు వ్రాయించుకొని కొంచెము సైన్యము ఈ నూతనసంపాద్యమును కాచుటకు వుంచి అందరు పోయిరి. 1759 మహారాష్ట్ర సేనాని గోవింద గోపాలరావు ఫ్రెంచివారొసగిన స్వల్పపారితోషకమునకు తృప్తిచెందక తిరుపతిని గంగమ్మ జాతరకు ముందు ముట్టడించి శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవస్థానమును తిరుపతియు లోపరచుకొనెను. అచ్చటనుండి పన్ను వసూల్ చేయదలచెను గాని మేనెలలో కృష్ణానదీ వరదలు వచ్చునని పునాకు బాలాజీరావు వాపసు రమ్మనగా నారాయణశాస్త్రి, అను వానిచేతిక్రింద కొంచము సేననుంచి తిరుపతిని వదలెను ఇంగ్లీషువారితో స్నేహముగా నుండిన నవాబు సహోదరుడగు అబ్దుల్ వహాబు చంద్రగిరినుండి ఇంగ్లీషువారితో చేరి తిరుపతికి స్వల్పసేనను పంపి లోబర్చుకొని దేవస్థానము తన స్వాధీనము చేయమని కోరెను గాని ఇంగ్లీషువారు యిదివరలోనుండిన యిజారాదారు కొసగిరి. నారాయణశాస్త్రి తిరుపతికి 15 మైళ్లు దూరముననున్న కరకంబాడిలో కొంతకాలముండి మట్లవారి సహాయమువలన సేనను చేర్చుకొని ఇంగ్లీషు సేనానీ విల్కక్ తన సేనతోను యిజారాదారుని సేనతోను యాత్రికులు వచ్చు కొండమార్గము కాచుచుండగా మారుత్రోవను కొండెక్కి దేవస్థానమును స్వాధీనము చేసికొనెను. జూలై నెల తే 9 దీని కొండనుండి మహారాష్ట్రులును, క్రిందనుండి మట్లవారును ముట్టడించిరిగాని ఓడిపోయిరి. దేవస్థానము యింకను వారి స్వాధీనములో నున్నది. తిరుగ మద్రాసునుండి సేన, ఫిరంగులు, విల్కక్ సేనాని సహాయమునకు వచ్చెను. నాలుగుజాతుల హిందూ సిపాయిలు

మాత్రం కొండనెక్క నర్హులగుటచే ఇంగ్లీషువారి హిందూ సిఫాయిలు యిజారాదార్ సేనయు కలసి 500 మంది కొండకు వచ్చి పోరాడిరిగాని ఓడిపోయిరి. హైద్రాబాదులో జరిగిన సంగతులవలన సుబాదార్ సహోదరుడైన బసాలత్ జంగ్ పదభ్రష్టుడై కొంతసేనతో దేశము దోచుకొనుచు నెల్లూరు ప్రాంతములకు వచ్చి తాను దక్కన్ సుబావల్ల పన్ను వసూల్ చేయుటకు పంపబడెనని చెప్పుచూ నజీబుల్లాఖానుకున్ను యింకను అనేక పాళెగార్లకున్ను, బాకీయుండు కప్పము చెల్లించవలసినదిగా బెదరించుచు జాబులు వ్రాసెను. ఆర్కాడులో ఫ్రెంచివారితో కలియుటకు వీర్ల రాజ్యములగుండా తాను పోవలెనని వెల్లడించ వీర్లందరకు మరింత భయకంపిత మాయెను. నజీబుల్లాఖానుయు, పాళెగార్లందరును మద్రాసులోని ఇంగ్లీషువారి సహాయము కోరినను తిరుపతికొండ తిరుగ స్వాధీనము చేసుకొనుటకు ఇంగ్లీషువారి కొకరయినను సహాయము చేయరైరి. ఇజారాదార్ ఓడిపోయినాడని విని పాళెగార్లు మొదలగువార్లకు భయము మరింత హెచ్చాయను. నారాయణశాస్త్రికి సహాయముగా సేన వచ్చుచున్నదనియు అది తిరుపతి ఆక్రమించినంతట వచ్చే ఉత్సవమువల్ల రాబడి ఇంగ్లీషువారికి చేరదని తెలియగా మదరాసునుండి, మేజర్ కాలియడ్ అను సేనాని సైన్యముతోను మందు, గుండు సామానులతోను తిరుపతికివచ్చి కరకంబాడి పాళెగార్లతో పోరాడి ఓడించి గ్రామమున్ను చుట్టుపట్లయున్ను ధ్వంసముచేసి, పాళెగారును చంపెను. తర్వాత తిరుపతికివచ్చి ఇజారాదారుయొక్క సైన్యమున్ను తన హిందూ సిపాయిలను కొండకు పంపి, నారాయణశాస్త్రిని మట్ల

వారి అడవికి పారదోలి శాస్త్రికి సహాయముగా సేన వచ్చుచున్న దని చెప్పుట నిజముకాదని తెలుసుకొని 10 మంది సోల్జర్లను విల్కక్సు వద్ద తిరుపతిలోనుంచి తాను బయలుదేరి వెళ్లెను. అనంతరం కొన్నిరోజులకు మట్లవారి సహాయమువల్ల కరకంబాడి మరమ్మతు చేయుచున్నారని విని విల్కక్సు సైన్యముతోను, మందుగుండు సామానులుతోను కరకంబాడికి వెళ్లెను గాని చచ్చేటట్టు గుండుదెబ్బలు తగుల డోలీలో సేనతో వాఫసువచ్చెను. ఇట్లుండగా బసాలత్ జంగ్ పెన్నానది దాటి పోలూరుకోట స్వాధీనపరచుకొని కాళాస్తివరకు రాగాయింగ్లీషు సేనాని కర్నల్ మూర్ సేనతో కాళాస్తివద్దకుఎదుర్కొనుటకు వచ్చెను. బంగారుయాచమనాయుడు దామెర్ల వెంకటప్పనాయుడుసంపతిరావు వీర్ల ఒకొక్కరివద్దను 40 వేల రూప్యములు కప్పము తీసికొని ఫ్రెంచివారు సహాయమునకు రారని తెలిసికొని తర్వాత వందవాసివద్ద కలతలు గ్రహించి ఇంగ్లీషువారు సైన్యముతో వందవాశివద్ద నుండుటగని కర్నాటకమునుండి పారిపోయిరి. తర్వాత సైన్యములన్నియు వారివారి ప్రదేశములు చేరెను.

ఈ దేవస్థానపు రాబడి ఈస్టిండియా కంపెనీవారికి చేరుచు దేశపరిపాలనమాత్రము 1801 వరకు ఆర్కాడు నవాబులు దిగా నుండెను. అయితే 1782 మొదలు 17:5 వరకున్ను 1790 మొదలు 1792 వరకున్ను నవాబులకు బదులు ఈస్టిండియా కంపెనీవారే దేశము పాలించుచుండిరి. 1801 జూలై 31-వ తేదీలో ఈస్టిండియా కంపెనీవారికి శాశ్వతముగా నవాబువద్దనుండి దేశపాలనంబు మారినందున మహమ్మదీయప్రభుత్వాంబంతమాయెను.

## ఇంగ్లీషు ప్రభుత్వము.

1801 జూలై 31 తేది మొదలు ఇంగ్లీషుప్రభుత్వము నకు లోబడి ఈ దేవస్థానం ఉన్నది. 1842 జూలై నెల 10 తేదిన శ్రీ మహంతు సేవాదాస్ జీవారి పేర సన్నదుపుట్టి దేవస్థానములకు విచారణకర్తలుగా పర్యంతువరకు ఈస్టిండియా కంపెని వారే సర్కారు ఉద్యోగస్తులనుంచి దేవస్థానపు వ్యవహారము లను చక్కచేయుచుండిరి. శ్రీహాత్తిరాంజీమఠం శ్రీమహాంతు సేవాదాస్ జీ వారి కాలమునుండి శిష్యపరంపర ఈ శ్రీ వేంకటే శ్వరస్వామివారి దేవస్థానమునకున్ను, అందుతో చేరిన యితర చిన్న దేవస్థానములకును విచారణకర్త (Trustee) గా నుండి దేవస్థానపు కార్యనిర్వాహకత్వము జరిపించుచున్నారు.

కలియుగములో స్మరణమాత్రమున ముక్తినిచ్చు శ్రీ వేంకటేశ్వరస్వామివారి దర్శనము ఈ చిట్టిపొత్తము యాత్రస్తులు చదివినంతటు సులభసాధ్యంబయి సమస్తసౌఖ్యముల నొసగును.

సంపూర్ణము.